Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రత్యర్థి కాదది...

పంపినవారు :
ఎ. అన్నాజీరావు - సాలూరు

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**(Rule 8 Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. | *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. | *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt.) Ltd. |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. | *Publisher's Name* | : | B. NAGI REDDI,<br>Managing Proprietor<br>CHANDAMAMA PUBLICATIONS |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. | *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. | *Name & Address of individuals who own the paper* | : | B. NAGI REDDI,<br>Sole Proprietor |

I, B. Nagi Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1958*

**B. NAGI REDDI,**
*Signature of the Publisher*

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

# పిల్లలకోసం –

# గిబ్స్ డెంటిఫ్రిస్ రంగులు వేసేపోటీ



## సులభం!

## ఆకర్షణీయమైన బహుమతులు!



మొదటి బహుమతి:
6 వాల్వుల. ఫిలిప్స్ రేడియో



రెండవ బహుమతి:
ఫెవర్‌లూబా రిస్టు వాచీ
"జాన్ బారెల్, 15 జ్యూయెల్స్"



మూడవ బహుమతి:
అగ్ఫా ఐసొలా కెమేరా

మరియు 100 ఆకర్షణీయమైన ప్రోత్సాహక బహుమతులు

నేడే పాల్గొనండి। ఇది సులభమైన ఉత్సాహకర పోటీ: మీరు చేయవలసిందల్లా ఇంతే. ఈ బొమ్మకు రంగులువేసి మాకు త్వరలో పంపండి. మీరు వాటర్ కలర్లు, రంగు పెన్సిలు లేక చాక్, లేదా మీకు లభించే మరియే ఇతర రంగులనైనా ఉపయోగించవచ్చును.

ముగ్గురు తీర్పరుల సంఘము అర్హతానుసారం ఏ బొమ్మలు శ్రేష్ఠమైనవో నిర్ణయింతురు. మీరు పొందవలెనని ఎల్లప్పుడూ ఎంతో ఎక్కువ కోరికతోనున్న ఏదో ఒక వస్తువును మీరు గెలుపొందవచ్చును.

ఈ పోటీలో నేడే పాల్గొనండి. మీకొక గిబ్స్ డెంటిఫ్రిస్ డబ్బీని కొనిపెట్టమని మీ అమ్మను అడగండి. దానిని ప్రతీరోజూ వాడండి।

ఈ నిబంధనలను జాగ్రత్తగా చదువండి: 1. 14 ఏళ్ల వయిస్సు మించనట్టిన్ని భారత దేశ నివాసులైయున్నట్టిన్ని ప్రతీ బాలుడుగాని, బాలికగాని ఈ పోటీలో పాల్గొనవచ్చును. 2. బొమ్మలను 'గిబ్స్ డెంటిఫ్రిస్ కాంటెస్ట్, పోస్టుబాక్స్ నం. 10119. బొంబాయి-1' ఈ చిరునామాకు 1958 ఏప్రిల్ 26వ తేదీ శనివారమునాడు మధ్యాహ్నం 1 గంటలోపుగా చేరునట్లు పంపండి. 3. ప్రతీ బొమ్మయున్నూ గిబ్స్ డెంటిఫ్రిస్ బిళ్లయొక్క పై సెల్లోఫేన్ రేపింగ్ మీదనున్న ఒక గిబ్స్ ముద్రను చేర్చి పంపబడవలెను. 4. బొమ్మలు కంపెనీకి చేరకుండా మధ్యలో పోయినను. ఆలసింపబడినను. తప్పు స్థలమునకు పంపబడినను లేదా చెడిపోయినను, అట్టి బొమ్మలకు కంపెనీవారు బాధ్యులుగారు. 5. మొదటి. రెండవ, మూడవ, బహుమతులను గెలుపొందినవారి పేర్లు జూలైలో ఈ పత్రికయందు ప్రకటించబడును. ఇతర

GD. 39-A50 TL

నా పేరు..............................................

..............................................

చిరునామా..............................................

..............................................

ఈ రంగులు వేయుట ఇతరుల సహాయత బొందని నా స్వయం కృషి యనిన్ని. నా వయస్సు        అనిన్ని. నేను ప్రకటించుచున్నాను.

చందమామ

బహుమతులను గెలుపొందిన వారికి పోస్టు ద్వారా తెలుపబడును. 6. ఒక పోటీదారుడు ఒక్క బహుమతికి మాత్రమే అర్హుడై యుండును. 7. తీర్పరుల నిర్ణయమే ఖాయమైనదిన్ని బద్ధమైన దిన్ని. 8. పోటీని గురించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు.

# గిబ్స్ డెంటిఫ్రిస్

పళ్లను బాగుగా శుభ్రపరచును. ఏంతో మంచి రుచిగా నుండును — చాలా కాలము వాడుకొనవచ్చును!

బొంబాయిలోని. హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్. వారి ఉత్పత్తి.




DL. 39B-50 TL


DIAMOND NUT
DP & Co. C.B BELLARY
POWDER


నీ బదులు నేనైతే వాళ్లను ఒక్కొక్కరిని చిలగడ దుంపల్లాగ సులువుగా పెరికి పారేశేవాడను!
శభాష్! డంబాల రాజా! ఎలా బడాయిలు కొట్టాలో నీకు తెలుసు!
సరేలే! నేను నీకు చెడుగుడు ఎలా ఆడాలో నేర్పుతాను!


జాగ్రత్తగా వుండండ బ్బాయ్! ఇడుగో చాప్పకట్ల వీరుడు వస్తున్నాడు
దాన్ని వదిలెయ్యి! నేను ఆయీగను ఒక్క చిటికెలో ధ్వంసం చేస్తాను!


ఆట అనంతరం
రంగా నీవు రోజూ పాలు త్రాగచూ "డాల్డా"తో వండబడిన ఆహారం భుజించుతూ వుంటేనే నీవు బలవంతుడ వౌతావు అని నేను నీకు ఎన్నోమాట్లు మరీమరీ చెప్పాను!
డాల్డా వనస్పతిలో చాలా సుగుణము లున్నవి అది మీకు బలమును కలిగించును, మీ శరీరమును శక్తి వంత మైనదిగా జేయును. మీ ఆహారము లన్నిటిని "డాల్డా"తో వండుకొని, అధిక శక్తిని పొందండి.


DALDA




ఫెస్టివల్

సూపర్ శాండల్ టాల్కం పౌడర్ & స్నో

తయారు చేయువారు : మురళీ ట్రేడర్స్, మదరాసు - 21.

ఆంధ్రజిల్లాలకు ఏజెంట్లు : శివకోటి లక్ష్మీనరసింహము, విజయవాడ.



# ఎడారి నౌక

సముద్రాలపై నౌకా యాత్రలను గురించి ఒళ్లు పులకరించే కథల్ని చాలా చదివేవుంటారు. కాని యీ కథమాత్రం "ఎడారి నౌక" ను గురించింది. "ఎడారి నౌక" నిజంగా నౌక గాదు. అదేంటో చెప్పుకోండి చూద్దాం?

ప్రపంచంలో చాలా ఎడార్లు వున్నాయి కదా! మన భారతదేశంలో కూడా ఎడారి వొకటుంది. ఎడారిని ఇసుక సముద్రం అనొచ్చు. రోడ్లు లేవు. ఎద్దుబండ్లు, మోటార్లు, ఇసుక దిబ్బల మీద పోలేవు. పట్టపగలు అదో భూలోక నరకంలా వుంటుంది. అలాగని ఎడారంతా ఇసుకమయం అనుకోకండి. అక్కడక్కడ 'ఓయసిస్' అనే సారవంతమైన పసిరిక స్థలాలున్నాయి. ఇక్కడ పనిపాట్లు చేసుకుంటూ చాలామంది ప్రజలు నివసిస్తున్నారు. ఇక్కడ రాకపోకలకు యీ "ఎడారి నౌకే" ఆధారం.

మనదేశంలో వున్నదే రాజస్థాన్ ఎడారి. ఇక్కడున్న 'ఓయసిస్'లలో పనిపాట్లు చేసుకుంటూ అనేకమంది నివసిస్తున్నారు. ఇక్కడి ప్రజలకు టీ—అందులోనూ బ్రూక్ బాండ్ టీ అంటే మహా యిష్టమట. ఎక్కడెక్కడ వున్న వారికీ బ్రూక్ బాండ్ టీ అంటే ఎంత యిష్టమో మీకు తెలుసుకదా? మరి వీరికి కావలసిన టీ ఎలా సరఫరా అవుతోంది? ఈ "ఎడారి నౌకే" వారికి తోడ్పడుతోంది. ఇదొక జంతువు. యీ జంతువులోని గొప్ప విశేషం ఏమిటో తెలుసా? రోజుల తరబడి నీ రక్కర లేకుండా వుండగలదు. నీళ్లెక్కడున్నదీ యిట్టే పసికట్టేస్తుంది. ఇదే ఒంటె. మండు టెండలో, ఇసుక దుమారాల్ని కూడా లక్ష్యపెట్టక ఎడారిలో మనుషుల్ని చాల జాగ్రత్తగా రవానా చేస్తుంది. అందుకే ఒంటెను "ఎడారి నౌక"అని అన్నారు.

బ్రూక్ బాండ్ సేల్సుమన్లు వారి "నౌక"— ఒంటె — సహాయంతో యిక్కడి ప్రజలకు సతనిత్యమూ తాజా బ్రూక్ బాండ్ టీని ఎలా అందిస్తున్నారో చూశారా!

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

BB 228

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ప్రజాజీవితంలో ఎప్పుడూ ఏవో లోపాలు ఉంటూనే ఉంటాయి. కాని వాటిని కేవలం అధికారంతోనూ, దౌర్జన్యం తోనూ మార్చటం సాధ్యంకాదు. ప్రజలలో కలిగే చైతన్యం వల్లనే అవి చక్కబడాలి. అధికార బలప్రయోగంతో ప్రజలను శాసింతామనే వాళ్లు కష్టాల పాలవుతారు. కేవలం మంచి పాలకులు అనిపించుకుందామనుకునే వారు ప్రజలను ఏమీ మార్చలేకపోతారు. ఈ సత్యాన్ని, "రాజప్రతినిధులు" అన్న కథ స్పష్టం చేస్తున్నది.

సంపుటి 22 ఏప్రిల్ 1958 సంచిక 4



# అట్టవీాది బొమ్మ

శత్రువులను సంహరించి విజయోత్సాహంతో ఉత్తరుడు వచ్చి తండ్రికీ, ధర్మరాజుకూ నమస్కారంచేశాడు. విరాటుడు తన కొడుకును, "నాయనా, పసివాడవు ఒంటరిగా ఆ మహాయోధులందరినీ ఎలా జయించావు?" అని అడిగాడు.

"నాన్నగారూ, వారిని జయించినది నేనుకాదు. నేను యుద్ధరంగానికి పోతూఉండగా ఒక దేవతాపురుషుడు వచ్చి రథం ఎక్కి నన్ను సారథిగా పెట్టుకుని, కౌరవయోధులతో పోరి అందరినీ ఓడించాడు! రెండు మూడు రోజులలోగా ఆయన మనకు దర్శనమిస్తాడు!" అని ఉత్తరుడు తండ్రికి జవాబు చెప్పాడు.

ఇది జరిగిన మూడవ రోజున పంచపాండవులు స్నానాలుచేసి మంచి బట్టలు ధరించి, తమ ఆభరణాలన్నీ పెట్టుకుని, విరాటుడి కొలువుకూటానికి వెళ్లి, అక్కడ రాజకుటుంబంవారి ఆసనాలలో కూచున్నారు. కొంతసేపటికి అక్కడికి విరాటుడు వచ్చి వారిని చూసి మొదట ఆశ్చర్యపోయాడు. తరవాత ఆగ్రహంతో ధర్మరాజుకేసి చూసి, "ఓ కంకుభట్టా, నాతో జూదం ఆడటానికి కుదిరినవాడివి మా ఆసనాలలో కూచున్నావేమిటి?" అని అడిగాడు. వెంటనే అర్జునుడు, "ఓ రాజా, ఈయన పాండవాగ్రజుడైన ధర్మరాజు. ఈయనకు నీ సింహాసనంకూడా చాలదు," అన్నాడు.

విరాటరాజు నివ్వెరపడి, "ఈయన ధర్మరాజైతే మిగిలిన పాండవులెక్కడ?" అని అడిగాడు. "రాజా నీ వంటలవాడు భీముడు, మీ కీచకుణ్ణి చంపింది ఇతనే. నీ అశ్వపాలకుడు నకులుడు, గోపాలకుడు సహదేవుడు. సైరంధ్రి ద్రౌపది!" అని అర్జునుడు చెప్పాడు. తరవాత ఉత్తరుడు అర్జునుణ్ణి తండ్రికి ఎరుకపరిచాడు.

విరాటరాజుకు చాలా పశ్చాత్తాపం కలిగింది. తాను పంచపాండవులచేత సేవ చేయించుకోవటమేగాక, వారివల్ల యుద్ధంలో చాలా సహాయం పొందాడు. అందుచేత ఆయన వారిని మంచిచేసుకునేనిమిత్తం తన కుమార్తె అయిన ఉత్తరను అర్జునుడి కొడుకైన అభిమన్యుడికి ఇచ్చి పెళ్లిచేస్తానన్నాడు.

ద్వారకనుంచి అభిమన్యుడూ, అతనివెంట కృష్ణ బలరామ సాత్యకి మొదలైనవారూ వచ్చారు. ఉత్తరాభిమన్యుల వివాహం వైభవంగా జరిగింది.




ఎన్నినాళ్ళో యుండి - ఏమేమొ చేసి
కొన్నాళ్ళు చెమటోడ్చి - కోరిక దీర
వంద బంగారంపు - వరహాలు చేర్చి
అందమౌ బట్టలో - నవి మూటగట్టి
తమ ఊరు పయనమై - తరలె నాతండు
సుమ కోమలాంగికి - చూపుద మనుచు
చరచర నడచుచు - సాయంత్రమునకు
చరణమ్ము లలయగా - దఱిసె వనమ్ము
చీమలు దూఱని - చిక్కటి యడవి
ఏమాత్ర నడచుట-కే కష్టమయ్యె
చీకటి క్రమ్మెను - రాకాసివోలె
ఏకాకి యెటులింక - ఏగుట పడును ?
అంత నాతండొక్క - అవనిజ మెక్కి
చెంత మూటను రెండు - చేతుల బట్టి
కను మూయునంతలో - కర్తయు కర్మ
తను గూర్చి అనుమాట - వినపడసాగె:

* * *

కర్మ:

ఓ కర్త ఇట్లల - నొనరించినావు
చేకూర్చినా వేల - చెంబెడు ధనము
వీనికి వలసిన - విత్తమ్మె కలదు
ఏనాడు దాచగా - నెటు వీలుకాదు

కర్త:

పనిచేసె గావున - ధనమిచ్చినాను
నను తిట్టుటేటికి ? - నాపని యింతె.
ఎంత ప్రాప్తమొ వాని - కిచ్చెద వీవు
చింతింపు మది యేదొ - చేతిలో గలదు.

* * *

ఇంతలో కల విచ్చి-యే పోయె వాని
కంతలో మెలకువ - యయినట్లు దోచె
తటుకున మేల్కొని - తన మూట చూడ
అటుకులె తప్ప అ-న్యము లేదు దాన.
వానికి మనసెల్ల - వందుఱసాగె
ఈ నీతి యేమని - యేడువసాగె.

విద్వాన్ విశ్వం



వట్టి చేతులతోడ - వలదూరు చేర
దిట్టతనమ్ముతో - తేవలె ధనము.
అని నిశ్చయించి తా - నటు వెనుదిరిగి
చనిచని ఆ పుర-మ్మును చేరె మఱల.
రెండవసారి అ-తం డిట్లు తేగ
మొండిగా నడవిలో - ముఱిగియేపోయె.
ఇటు మూడుసారు లెం-తటి మూటగట్టి
ఎటువచ్చినా దారి-నే మాయమయ్యె.
మూడవసారి అ-మూటలో నున్న
మూడు వందల నిండు-మాడలు వోవ
వాని చిత్తమ్మున - వఱదలు పొంగి
వాని నిశ్చయమెల్ల - వమ్మయిపోయె.



ఉత్త చేతులతోడ - ఊరు పోలేడు.
విత్తమ్ము తెచ్చిన - వృథ యగుచుండె
'ఛీ, యేటి బ్రదు'కని - ఛీ కొట్టుకొనుచు
ఏ యుపాయము లేక - ఇక విధి లేక
అ చెట్టుకొమ్మకే - అత నురిపోసి,
నే చత్తునని తల-నే దూర్చి నిలిచె.
ఈ యాగడము చూచి-యే వచ్చె కర్త,
'ఓయి, ఆగు' మటంచు - ఓదార్చ దొడగె.

కర్త:

నీకెంత ప్రాప్తమో - నేనిత్తు నంతె
శోకింప నేల? చీ-కాకేల నీకు?
ఐన నీదీక్ష నా - కానందమయ్యె
ఈనాడు కోరుకొ - మ్మేమి కావలయు

సోమిలకుడు:

అట్లైన ధనవంతు - డగునట్లు సేయు.
చిట్లింపబోకు నీ - చిఱు కనుబొమల.

కర్త:

నీకెంత వలయునో - నే నిచ్చుచుంటి
రాకాసి డబ్బుకై - చీకాకు లేల?
అనుభవింపగలేని - అర్థమ్ము లేల?
అనువైనదే నీకు - నబ్బును సుమ్ము.

సోమిలకుడు:

అనుభవింతునొ లేదొ - అది యేల నీకు



ధనమిమ్ము నాకదే - తప్పక వలయు.
పిసినిగొట్టైనను - పిదపవాడైన
పస గ్గలువాడౌను - పణమున్న జాలు.

కర్త:

సరియైనచో ఒక - షరతున్నదోయి
పురి కేగి అచ్చట - తిరిగి రమ్మింక.
అట గుప్తధనుడను-నత డొకడుండు
అట నుపభుక్తార్థు - డనువాడు కలడు.
వారిని చూచి అ-పైననే, రమ్ము
కోరిన వరమిత్తు - కోరు మాపైన
కుడువజాలని డబ్బు - కోరిన నిత్తు
కుడుచుటకే యని - కోరిన సరియె.

*　　*　　*

అతడు సరేనని - అరిగె పట్టణము
కృతకృత్యుడై రవి - కెరలె నస్తాద్రి.
మార్గ శ్రమమ్మున - మఱిమఱి యడిగి
దుర్గమమౌ దారి - దొరకొని నడచి
గుప్త ధనాఖ్యుని - గూడును జేరి
ఆప్తునివోలె గృ-హాంతరమ్మునకు
చేరినవారెల్ల - చీదరించుకొని
పోరా అటన్నను - పోనని నిలిచె.
ఇక మొండివాడని - ఏమనలేక
ఒక ముద్ద పడవేసి - ఉండి పొమ్మనిరి.



రేయి నిద్రింపగా - నాయన వినియె
మాయని కర్త క-ర్మల వివాదమ్ము.

*　　*　　*

కర్మ:

ఓ కర్త యిది యేమి - ఊహింపలేను.
ఈ కష్టగుప్త ధ-నేశు ధనమ్ము
సోమలకుని భుక్తి-తో మఱి కఱగె
ఆ మానవుని ధన - మట్లు కారాదు.

కర్త:

పురుముల లాభమ్ము - పురుముల వ్యయము
సరిపడ జేయించు - వెఱవుండ లేదె
నాదేమి కలదు నీ-వే దాని చూడు
ఏదో మార్గమ్ముండు - నింత యోచింపు.




# భైరవశాస్త్రి

పూర్వం కళింగదేశాన్ని మణిభద్రు డనే రాజు పరిపాలించాడు. ఆయన మంత్రి ఇందుశర్మ చాలా తెలివిగలవాడు. రాజుగారి నౌకర్లు లగాయతూ రాజబృందమంతా ఇందుశర్మ చెప్పుచేతలలో ఉంటూ ఉండటంచేత రాచకార్యాలు అవిఘ్నంగా సాగిపోతూ వుండేవి.

రాజుగారికి కాలక్షేపం చెయ్యటానికిగాను భైరవశాస్త్రి అనే ఆయన ఏర్పాటయాడు. ఆయన నిత్యమూ రాజుగారి వద్దకు వెళ్లి ఆయనకు విశ్రాంతి వున్న సమయంలో వినోదం కలిగించి వెళ్లిపోతూ వుండేవాడు.

భైరవశాస్త్రికి రాజుగారితో తప్ప మరెవరితోనూ పనిలేదు. అందుచేత ఆయన ఇతరుల నెవరినీ ఖాతరు చేసేవాడు కాడు. రాజుగారికి తనపై అనుగ్రహం వున్నంత కాలమూ రాజ పరివారంలో ఎవరినీ తాను లక్ష్యపెట్ట నవసరంలేదని ఆయన అనుకున్నాడు. ఆఖరుకు మంత్రిగారిపట్ల కూడా ఆయన నిర్లక్ష్యంగా ప్రవర్తించసాగాడు.

ఇది చూసి మంత్రిగారికి ఆగ్రహం వచ్చింది. ఆయన ఈ భైరవశాస్త్రికి ఉద్వాసన చెప్పాలని నిశ్చయించి రాజద్వారం వద్ద కాపలా వుండేవాణ్ణి పిలిచి, "ఒరే, రేపు లగాయతు భైరవశాస్త్రిని లోపల అడుగు పెట్టనివ్వకు," అని చెప్పాడు.

మర్నాడు భైరవశాస్త్రి రాజదర్శనంకోసం వస్తూవుండగా ద్వారంవద్ద వున్న భటుడు, "తమరు లోపలికి వెళ్లటానికి వీలులేదు. తమరిని రానివ్వవద్దని వుత్తరువయింది," అని చెప్పాడు.

భైరవశాస్త్రి ఆశ్చర్యపోయాడు. ఇందులో ఏదో పొరపాటుం దనుకున్నాడు. ఆ క్రితం రోజుకూడా రాజుగారు తనతో కులాసాగా మాట్లాడారు. ఇంతలో ఏమి జరిగివుంటుందో ఆయనకు అర్థంకాలేదు.

"చిదానంద"

"మహారాజా, నాకు ఎందుకు ఉద్వాసన చెప్పారు! నావల్ల జరిగిన తప్పేమిటో సెలవిస్తే దిద్దుకుంటాను," అని ఒక ఉత్తరం రాసి భైరవశాస్త్రి లోపలికి పంపించాడు.

ఆ ఉత్తరం మంత్రిగారిదాకా వెళ్ళి ఆ తరవాత బుట్టదాఖలయింది.

రెండురోజులుగా భైరవశాస్త్రి రాకపోవటం గమనించి రాజుగారు, "ఈమధ్య భైరవశాస్త్రి కనిపించటం లేదు, ఎందుచేత ?" అని తన సేవకులను అడిగాడు.

ఎవరినడిగినా తమకు తెలియదన్నారు. ఈ ప్రశ్న మంత్రిగారిదాకా వెళ్ళింది. అయన వచ్చి రాజుగారితో, "మహాప్రభూ, భైరవశాస్త్రి ఖాయిలాపడి నిన్నరాత్రే మరణించాడు. అయనకు అంత్యక్రియలుకూడా జరిపించి వచ్చాను," అన్నాడు.

రాజుగారి వద్దనుండి ఏ జవాబూ లేక పోవటం చూసి భైరవశాస్త్రి తన ఉత్తరం రాజుగారికి చేరలేదని గ్రహించాడు. "నాకు రాజప్రాంగణంలో మిత్రులెవరూ లేరు. రాజుగారు బయటికి వచ్చినప్పుడు ఆయనతో నేరుగానే చెప్పుకుంటాను," అనుకుని ఆయన అవకాశంకోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాటి సాయంకాలం రాజూ, మంత్రీ ఇతర పరివారమూ గుర్రాలెక్కి వాహ్యాళికి బయలుదేరారు. రాజుగారికి అంతదూరాన



భైరవశాస్త్రి కనిపించేసరికి ఆయనకు ఎక్కడ లేని ఆశ్చర్యమూ కలిగింది. "మంత్రీ, అడుగో భైరవశాస్త్రి! బతికే ఉన్నాడే? చనిపోయాడంటివే?" అని రాజు మంత్రిని అడిగాడు.

మంత్రి ఏమాత్రమూ తడుముకోకుండా, "అవును మహారాజా, భైరవశాస్త్రి భూతమయాడు!" అన్నాడు.

మిగిలినవారు మంత్రి ఎంత చెబితే అంతే. "అవును, మహారాజా, ఆ కనిపించేది భైరవశాస్త్రి భూతం!" అన్నారు.

ఈ మాటలను భైరవశాస్త్రి విన్నాడు. ఆయనకు తన బుద్ధిపొరపాటు తెలిసి వచ్చింది. ఆయన ఒక చీటీమీద ఒక శ్లోకం రాసిపెట్టుకుని, రాజుగారు ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు ఆయన చేతికి అందించాడు.

రాజుగారు ఆ చీటీ విప్పి ఈ విధంగా చదువుకున్నాడు.

"రాష్ట్రిః సేవ్యో, నృపః సేవ్యః ;
న సేవ్యః కేవలో నృపః.
రాష్ట్రివక్ర ప్రభావేన
భైరవో భూతతాంగతః"

[రాజుతోబాటు పరివారాన్నికూడా సేవించాలి, కేవలం రాజునుమాత్రమే సేవించరాదు. పరివారం అనుగ్రహం చాలనందున భైరవుడు (బతికుండగానే) భూతం అయాడు]

రాజుకు జరిగిన సంగతి అర్థమయింది. ఆయన తన మంత్రితో, "భైరవశాస్త్రి పోయాడనీ భూతమయాడనీ నాతో అబద్ధాలు చెప్పారా?" అని అడిగాడు.

మంత్రిగారు జరిగినది జరిగినట్టుగా చెప్పాడు. ఒక విదూషకుడికోసం సమర్థుడైన మంత్రిని పోగొట్టుకోలేడు గనక రాజు మంత్రిని ఏమీ అనక, భైరవశాస్త్రిని తిరిగి కొలువులో పెట్టమనిమాత్రం అన్నాడు.

భైరవశాస్త్రికూడా ఈసారి మంత్రికీ ఇతర అధికారులకూ తగిన వినయవిధేయతలు చూపుతూ రాజుగారి సేవ చేశాడు.






## 16

[హసన్‌గోరీతో కలిసి, పింగళుడు ఇఫీఖిల్లా కోటతలుపులు తెరవబోయేసరికి, ఎడారిదొంగలు వాటి వెనక పెట్టిన మాటు పేలి, కొందరు సైనికులు గాయపడ్డారు. తరవాత ఎడారి దొంగ రాబందు, కొండలలో కనిపించాడు. అక్కడ పోరు జరిగింది. అదేసమయంలో పింగళుడికి హఠాత్తుగా, మాంత్రికుడైన పద్మపాదుడు కనిపించాడు. తరవాత—]

మహామాంత్రికుడైన పద్మపాదుణ్ణి, తిరిగి తను జన్మలో చూడగలనని పింగళుడు ఏనాడూ భావించలేదు. అలాంటి స్థితిలో పద్మపాదుడు, హఠాత్తుగా కనిపించటమే గాక, అదీ....అవంతీనగర రాజ్యభూములకు ఎడంగా ఎక్కడో వేలమైళ్ళదూరాన వున్న ఎడారికొండలలో అవటం; పింగళుణ్ణి ఎంతో ఆశ్చర్యపరిచింది. కాని, మరుక్షణంలోనే అతడి ఆశ్చర్యం అనుమానంగా మారటంతో, అతడు తన పక్కనే వున్న హసన్‌గోరీకేసి చూశాడు.

హసన్‌గోరీ ముఖంలోకూడా అనుమానం, సంశయం తొణికిసలాడుతున్నవి. అతడు పింగళుడి భుజం పట్టుకుని దగ్గిరకు లాగుతూ, "పింగళా! ఎవరీ పద్మపాదుడు? ఎడారిదొంగ రాబందు యితడే కాదుగదా ?" అన్నాడు రహస్యంగా.

పింగళుడు ఏదో చెప్పబోయేంతలో పద్మపాదుడు వారిని సమీపించాడు. అతడు హసన్‌గోరీకేసి వేలు చూపుతూ, "పింగళా! ఎవరీతడు?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో పింగళుడు మరీ తికమక పడిపోయాడు.






అతడు పింగళుడిని సమీపించి, అతడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "పింగళా! ఇప్పుడు, యీ కొండప్రాంతాలనుంచి పారిపోయిన ఎడారిదొంగలకు నాయకుణ్ణి నేనే అని మీయిద్దరూ అనుమానించటం లేదు గదా ?" అని అడిగాడు.

"లేదు, పద్మపాదా !" అంటూ పింగళుడు, హసన్‌గోరీని చూపుతూ, "ఈయన నవాబుగారి ఒంటెల పటాలం నాయకుడు, పేరు హసన్‌గోరీ. రాబందు అనబడే ఎడారి దొంగకోసం, యీయన యీ ప్రాంతాలన్నీ గాలిస్తున్నాడు," అన్నాడు.

అతడి తడబాటును గుర్తించిన పద్మపాదుడు, అందుకు కారణం ఏమిటో గ్రహించినట్లు చిరునవ్వునవ్వుతూ, "పింగళా! నీవు నన్నుగురించి ఏదో అనుమానిస్తున్నట్టున్నది, అవునా ?" అని ప్రశ్నించాడు.

పింగళుడికి ఏమని జవాబు చెప్పాలో తెలియలేదు. అతడి దృష్టి, పద్మపాదుడి మీదినుంచి హసన్‌గోరీకేసి తిరిగింది; దానితో హసన్‌గోరీ పద్మపాదుడికేసి ఒక అడుగు ముందుకు వేసి, "అయ్యా, మీరెవరో నాకు తెలియదు. కాని...." అంటూ ఆగాడు. హసన్‌గోరీ మాటలకు పద్మపాదుడు బిగ్గరగా నవ్వాడు.

పద్మపాదుడు ఆ మాటలు వింటూనే, హసన్‌గోరీకేసి తిరిగి, "అయ్యా! మీరు ఎడారి రక్షకభటనాయకులైతే, మీరు కాపాడవలసిన కొందరు వర్తకులు, ఆ కనబడే గుహలో బంధింపబడి వున్నారు. వారికి సాయంచేయండి," అన్నాడు.

హసన్‌గోరీకి పద్మపాదుడిమీద యింకా నమ్మకం కలగలేదు. అది గ్రహించిన పింగళుడు అతడితో, "హసన్, మీరు యీ పద్మపాదుణ్ణి నావగ్గిర వదలండి. మీరేమీ భయపడవలసిందిలేదు. ఈయన్నుంచి సర్వం నేను తెలుసుకుంటాను. ఒకవేళ యీయనే దొంగల నాయకుడైన రాబందు అయితే.





మీకు కాళ్ళూ చేతులూ కట్టి ఒప్పగించ గలను," అన్నాడు.

పింగళుడి మాటలు, హసన్‌గోరీలో వున్న అనుమానాలనన్నిటినీ పటాపంచలుచేసినై. అతడు కొందరు సైనికులను వెంటబెట్టు కుని, పద్మపాదుడు చూపిన కొండగుహకేసి బయలుదేరి వెళ్ళాడు.



"పింగళా! యీ దేశంకాని దేశంలోని ఎడారిప్రాంతపు కొండల్లో నిన్ను యీవిధంగా కలుసుకోవటం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది. అవంతీనగరంలోని నీ స్వగృహాన్ని వదిలి, యింతదూరం ఏకారణం చేత నీవు రావటం సంభవించింది?" అని ప్రశ్నించాడు పద్మపాదుడు.

"పద్మపాదా! నాది చాలా దీనాతిదీన మైన కథ. మీరిచ్చిన మహత్తు గల సంచీనీ, ధనరాసులనూ, ఆఖరికి అన్నిటా సహాయ పడుతూండే భల్లూకకేతుణ్ణికూడా కోల్పో యాను. ఈ బాధలన్నిటికీ మూలకారణం, దుర్మార్గులూ, కుచ్ఛితులూ అయిన నా అన్నలు. మీనుంచి శెలవుతీసుకుని, నా స్వగృహం చేరినప్పటినుంచి యీనాటి వరకూ, నేను అనుభవించిన యాతనలను గురించి చెప్పాలంటే—చాలాకాలం పడు తుంది. ముందుగా మీరీప్రాంతాలకు ఏ కారణంవల్ల వచ్చారో చెప్పండి. మరో మాంత్రికుణ్ణి జయించటానికి వచ్చివుంటే, నేను మరోసారి మీకు సాయపడగలను," అన్నాడు పింగళుడు.

పింగళుడు అన్న ఆఖరి మాటలు పద్మ పాదుడికి సంతోషం కలిగించినా, ప్రారం భంలో అతడు తన ధనాన్ని, మహత్తు గల సంచీనీ పోగొట్టుకున్నట్టు చెప్పిన విషయం మాత్రం అతడికి చాలా విచారం కలిగిం చింది. భల్లూక పర్వతాలదగ్గిర మహా మాయుణ్ణి జయించటంలో పింగళుడు తనకుచేసిన గొప్ప సహాయాన్ని, పద్మ పాదుడు యీనాటివరకూ మరిచిపోలేదు.



"పింగళా! నేను మరే మాంత్రికుణ్ణి జయించేందుకూ యీ ప్రాంతాలకు రాలేదు. మహామాయుడి సమాధినుంచి మనం సంపాయించిన అపూర్వ శక్తులుగల వస్తువులు నాదగ్గిర వున్నంతకాలం, నేను యీ లోకంలో ఎవరిని చూచీ భయపడ నవసరం లేదు. నేను కేవలం దేశాలు చూచేందుకూ, యాత్రాస్థలాలను సందర్శించేందుకూ బయలుదేరాను. ఆ కారణంవల్ల, నేను మామూలు యాత్రికుడి వేషంలో, ఒకానొక బిడారు వర్తకులతో కలిసి యీ ప్రాంతాలకు చేరాను. ఈ సాయంకాలమే ఆ బిడారుమీద కొందరు దొంగలు దాడిచేసి, విలువగల



సామానులన్నీ దొంగిలించి, వర్తకుల నందరినీ, ఆ కనబడే గుహలో బంధించారు. వారిలో కొందరు అవంతీనగరవాసులు వున్నారు," అన్నాడు పద్మపాదుడు. ఆ మాటలు వింటూనే పింగళుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

అతడు పద్మపాదుడి ముఖంలోకి అనుమానంగా చూస్తూ, "పద్మపాదా! మహా మాంత్రికులైన మీరుండికూడా, క్రూరులైన ఆ ఎడారి దొంగలు వర్తకులను దోచుకుంటూ వుంటే చూస్తూ ఎలా వూరుకోగలిగారు?" అని అడిగాడు.

పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. "పింగళా! నేను ఆ బిడారువర్తకుల గుంపు వెంట బయలుదేరినప్పుడు, యాత్రికుణ్ణని మాత్రమే చెప్పాను. అలా కాక, నేను ఫలానా మాంత్రికుణ్ణని చెప్పివుంటే, వాళ్ళెవరూ నన్ను బిడారువెంట రానిచ్చేవారు కారు. ఆ కారణంవల్లనే ఎడారిదొంగలు వారిని దోచుకుంటున్నా, నేనెవరో బయట పడకుండా వుండేందుకుగాను, నా మంత్రతంత్రాలను, ఆ దొంగలమీద ప్రయోగించకుండా, యీ రాళ్ళ చాటుకు తప్పుకున్నాను," అన్నాడు పద్మపాదుడు.

"మీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది పద్మపాదా!" అన్నాడు పింగ





ళుడు. "మీవద్ద వున్న అద్భుతవస్తువులైన భూగోళం, ఉంగరం, వజ్రాలు తాపిన పిడి గల కత్తి—వీటిలో ఏ ఒక్కదాని సాయంతో అయినా, మీరు చూడవలసిన స్థలాలన్నీ ఇట్టె చూసిరావచ్చునుగదా? అలాంటప్పుడు మార్గశ్రమలకన్నిటికీ ఓర్చి, యీ వర్తకుల వెంట బయలుదేరట మెందుకు?" అన్నాడు.

"ఓహో, పింగళా! నేనా దొంగల నాయకుడైన రాబందునని, యింకా నీవు అనుమానించటం లేదుగదా?" అంటూ పద్మపాదుడు పింగళుడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసి, "దేశదేశాలు తిరుగుతూ, ఆయాచోటుల వున్న పుణ్యక్షేత్రాలను దర్శించి, ఆ ఫలం అనుభవించాలంటే, అందరితోపాటు నేనూ పాదచారిగానే వెళ్ళవలిసి ఉంటుంది. అంతేకాని నాదగ్గిర వున్న అద్భుత శక్తుల సాయంతో, అనుకున్న చోటుకు మరుక్షణాన చేరటంవల్ల యాత్రా ఫలం దక్కదు" అన్నాడు.

వీళ్లిలా మాట్లాడుతుండగా, అల్లంత దూరాన హసన్‌గోరీ సైనికుల కేకలతోపాటు బిడారువర్తకుల ఏడుపులూ, పెడబొబ్బలూ, కలిసి చెవులు చిల్లులు పడేలా—రణగొణ ధ్వని సాగటంతో ఆ ప్రాంతమంతా గందరగోళంగా తయారైంది. పింగళుడూ, పద్మపాదుడూ తమ సంభాషణ ఆపి, అటుకేసి తలలు తిప్పారు. అదే సమయంలో ఒక సైనికుడు పరిగెత్తుతూ పింగళుడి దగ్గిరకు వచ్చి, "రాబందును వెంటబడి పట్టుకునేందుకు, హసన్‌గోరీ సర్దార్, మీ సాయం కావాలంటున్నాడు!" అని చెప్పాడు.

పింగళుడు, పద్మపాదుడికేసి బ్రతిమాలుతున్నట్టు చూసి, "పద్మపాదా! యీ హసన్‌గోరీ నన్ను, యీ ఎడారిలో దాహానికీ, ఆకలికీ మాడి చావకుండా రక్షించాడు. నేను యిందుకు ప్రతిగా ఆయనకు ఏదైనా సహాయం చేయాలనుకుంటున్నాను. ఈ చీకట్లో, ఆ ఎడారిదొంగలను పట్టుకోవటం

మానవమాత్రుడివల్ల అయేపని గాదు. ఆ ఎడారిదొంగలూ, వారి నాయకుడైన రాబందూ బహు క్రూరులు. ఈ దగ్గిరలో వున్న ఒక ఖిల్లాలోని సైనికులందరినీ హత్యచేసి, కపటో పాయంతో మమ్మల్నికూడా చంపేందుకు వాళ్ళు ప్రయత్నించారు. కనుక, యీ ఎడారిదొంగలను పట్టుకునే ప్రయత్నంలో మీరు మీ అద్భుతశక్తులను ప్రయోగించి మాకు సాయపడండి. ఆ విధంగా, యీ ప్రాంతాల ప్రయాణించే వర్తకులకూ, యాత్రికులకూ ఆ ఎడారిదొంగల నుంచి రక్షణ కల్పించండి! మీమేలు వారెన్నటికీ మరిచిపోరు," అన్నాడు.

"పింగళా! నీవు కోరుతున్నావు గనక సాయం చేస్తాను. కాని, అందువల్ల నేను మాంత్రికుణ్ణని, ఆ వర్తకులందరూ గ్రహి స్తారు. ఆ తరవాత వారితో నేను ప్రయా ణించటం అసంభవం. సరే, యాత్రాస్థలాలు దర్శించేందుకు ఎన్ని మార్గాలు లేవు!" అంటూ పద్మపాదుడు, ఒక రాయిని తీసు కుని, దానిని తన కత్తితో చిన్నచిన్న ముక్కలుగా నరకసాగాడు.

పద్మపాదుడు చేస్తున్న పని చూసి పింగ ళుడు చాలా అబ్బురపాటు చెందాడు. అతడు పద్మపాదుడి భుజంపట్టుకుంటూ, "పద్మపాదా, మీరు చేస్తున్న పని ఏమిటి?





అవతల ఎడారిదొంగలు, వర్తకుల సొమ్ము దోచుకుని పారిపోతున్నారుగదా! ముందు, వాళ్లను హతమార్చే ఉపాయం ఆలోచించండి!" అన్నాడు.

పద్మపాదుడు నవ్వుతూ, తన గుప్పెటలోకి కొన్ని రాతిముక్కలను తీసుకుని, వాటిని పింగళుడికి చూపుతూ, "ఈ చీకటిలో, ఆ దొంగలను వెన్నాడటం మానవమాత్రుడికి సాధ్యంకాదని నువ్వే చెపుతున్నావుగదా? అందుకని, చీకటిలో చూడగలిగిన తోడేళ్లనూ, పెద్దపులులనూ ఆ దొంగలను మట్టించుకువచ్చేందుకు పంపుతున్నాను. యీ అరచేతిలో వున్న పెద్ద రాతిముక్కలు పులులు, చిన్నవి తోడేళ్లు!" అంటూ ఆ రాతిముక్కలను మంత్రించి, బలంకొందికీ వాటిని ఆ చీకట్లో అన్నివైపులకూ వెదజల్లాడు.

చూస్తూండగానే ఆ కొండరాళ్లల్లోనుంచి భీకరంగా అరుస్తున్న తోడేళ్లూ, పెద్దపులులూ బయటికివచ్చి, రాతిబండలమీదినుంచి కుప్పించి దూకుతూ, అన్ని వైపులకూ పరుగులు దీసినై.

ఈ అద్భుతదృశ్యం చూసి పింగళుడు నిశ్చేష్టుడయ్యాడు. అతడు చూస్తూండగానే, కొండగుహనుంచి హసన్‌గోరీ విడిపించిన వర్తకులందరూ గుంపుగా బయలుదేరి పద్మ

పాదుడు వున్నచోటుకు వచ్చారు. వారివెంట వున్న హసన్‌గోరీ చేతులను గాలిలో అల్లల్లాడిస్తూ, "పింగళా! ఏమిటీ వింత? ఈ కొండప్రాంతాల నేనెన్నడూ ఒక్క తోడేలును గాని, ఒక్కగానొక్క పెద్దపులినిగాని చూసినది లేదు. కాని, యిప్పుడు...." అంటూ కళ్లింత చేసుకుని పింగళుడికేసి చూస్తూ ఆగిపోయాడు.

"పద్మపాదా! ఇక మీగురించిన రహస్యం దాచి లాభంలేదు గనక, వీరందరికీ నిజం చెప్పమంటారా?" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు అంగీకారసూచకంగా తల వూపి, తన దుస్తుల్లో దాచివుంచిన మహామాయుడి వేలి వుంగరాన్ని బయటికి తీసి, అక్కడ ఎత్తుగా వున్న ఒక కొండ రాతిమీద పెట్టాడు. మరుక్షణమే ఆ ప్రదేశమంతా కండ్లు మిరుమిట్లు కొలిపే కాంతితో, పట్ట పగటిలా అయిపోయింది.

పింగళుడు ఒకటి రెండు మాటల్లో పద్మపాదుడు మహామంత్రవేత్త అని అక్కడ చేరినవారందరికీ చెప్పి, హసన్‌గోరీకేసి తిరిగి "హసన్! ఆ ఎడారిదొంగ రాబందును గురించి నీవేమీ ఆదుర్దాపడ నవసరంలేదు. పద్మపాదుడు పంపిన తోడేళ్లూ, పెద్దపులులూ అతణ్ణి, అనుచరులతోపాటు, యిక్కడికి మందవేసుకు రాగలవు," అన్నాడు.

పింగళుడు మాట పూర్తిచేయకముందే, ఆ కొండలోయల్లో హాహాకారాలు బయలుదేరినై. వాటితోపాటు తోడేళ్ల అరుపులూ, పెద్దపులుల రంకెలూకూడా వినిపించినై. చూస్తూండగానే వందల సంఖ్యలో వున్న ఎడారిదొంగలు, అన్నివైపులా చుట్టుముట్టుతున్న క్రూరమృగాలనుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, ఎటూ దారి కానక, పద్మపాదుడూ, పింగళుడూ వున్న చోటుకు భీతితో అరుస్తూ రాసాగారు.

—(ఇంకా వుంది)






# అలీనూర్

[గత సంచిక తరువాయి]

సుల్తాను ఒక క్షణంపాటు తన వజీరును గుర్తించలేకపోయాడు. తరవాత ఆయన, "నిన్నిలా చేసిన దెవరు?" అని ఆశ్చర్యంతో అడిగాడు.

"మహారాజా, మంచి వంటమనిషిని కొందామని బజారుకు వెళ్లాను. అక్కడ ఒక బహు సౌందర్యవతి అయిన బానిస అమ్మకానికి వచ్చింది. మన అల్ ఫదల్ కొడుకు అలీనూర్ ఆమెను అమ్ముతున్నట్టు తెలిసింది. తమరు ఒకప్పుడు మంచి బానిసను పదివేల దీనారాలకు కొనమని అల్ ఫదల్‌ను అడిగిఉన్నారు. ఆ బానిస ఇదేనట. దానిని అల్ ఫదల్ తమకు సమర్పించక తన కొడుకుకు కానుకగా ఇచ్చుకున్నాడు. వాడు ఇటీవల ఒళ్లుపై తెలియకుండా ఉన్నదంతా తగలేసి బికారీ అయినాడు లెండి. అందుచేత ఈ బానిసదాన్ని అమ్మకానికి పెట్టాడు. బేరం చవుకలో నాలుగువేల దీనారాలకు పోతున్నదని తెలిసి, తమకు సమర్పించుకుందామనే ఉద్దేశంతో ఆ బానిసను కొనేశాను. అప్పుడు వాడేం చేశాడో చిత్తగించారా? ఏ కిరస్తానీలకో యూదులకో అమ్ముతాను గాని నీకైతే అమ్మను పొమ్మన్నాడు! అప్పటికీ నేను మంచిగా, 'నాయనా, దీన్ని నాకోసం కొనటం లేదురా! మన సుల్తానువారి కోసం కొంటున్నానురా!' అని చెప్పా. ఆ మాటకు వాడు మరింత మండి పడి, నన్ను గుర్రంమీద నుంచి కింద పడేసి, అంతమందీ చూస్తూండగా, చేతులా కాళ్లా తన్నాడు! ఏం సాహసం! ఏం పొగరు!" అన్నాడు వజీరు.

సుల్తాను ముఖం ఆగ్రహంతో జేవురించింది. ఆయన తన భటులను పిలిచి, "మీరు నలభైమంది వెళ్ళి, అల్ ఫదల్ ఇంటిని పూర్తిగా ధ్వంసంచేసి, నీచుడైన అలీ

ఎస్. ధర్మారావు



నూర్‌నూ, వాడి బానిసనూ పెడరెక్కలు విరిచికట్టి తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

అదృష్టవశాత్తూ ఆ సమయాన రాజుగారి భవన రక్షకులలో ఒకడు ఒకప్పుడు అల్ ఫదల్ కింద కొలువుచేసినవాడు వున్నాడు. అతను అలీనూర్ ఈడువాడే. ఇద్దరూ కలిసి పెరిగారు. అందుచేత అతను రాజాజ్ఞ వింటూనే బయటికి జారుకుని, అడ్డదార్లవెంట పరిగెత్తి అలీనూర్ ఉంటున్న ఇల్లు చేరుకుని, "బాబూ, తమరు వెంటనే ఇల్లు వదిలి ఎక్కడైనా పారిపోవాలి. లేకపోతే మాన ప్రాణాలు దక్కవు," అని జరిగిన సంగతి చెప్పేశాడు.

అలీనూర్ ప్రియసఖిని ప్రయాణానికి సిద్ధంచేశాడు. రాజభవనపాలకుడు అలీనూర్ చేతిలో నలభై దీనారాలు పెడుతూ, "నా దగ్గిర ఇంతకంటె లేదు, బాబూ. ఈ సొమ్ము తీసుకుని మీరిద్దరూ ప్రాణాలు దక్కించుకోండి," అన్నాడు.

అలీనూర్, ప్రియసఖీ దొడ్డిదారిన ఇంటి నుంచి బయటికి వచ్చి, సందులవెంటా గొందులవెంటా పడి సముద్రతీరపు రేవు చేరుకున్నారు. అదృష్టవశాత్తూ ఒక పడవ లంగరెత్తి బాగ్దాదునగరానికి బయలుదేరబోతున్నది. "ప్రయాణీకులందరూ ఎక్కెయ్యాలి! వ్యవధిలేదు!" అని సరంగు కేక వేస్తున్నాడు. ఏమాత్రమూ సంకోచించకుండా ఇద్దరూ ఆ పడవలో ఎక్కారు. లంగరు ఎత్తి పడవ బాగ్దాదుకు బయలుదేరింది.

అలీనూర్ ఇల్లువిడిచిన కొద్దిసేపటికల్లా సుల్తాను పంపిన నలభైమంది భటులు అతని ఇంటిపైబడి కనబడినదల్లా ధ్వంసం చేసి చూస్తుండగానే ఇంటిని నేలమట్టం చేసేశారు. అయితే వారికి అలీనూర్ జాడగాని, అతని బానిస జాడగాని తెలియలేదు.

ఈ సంగతి తెలిసి సుల్తాను బస్రానగరమంతా అలీనూర్ కోసం వెతికించాడు. ఆయన వజీరుసావీని పిలిచి, "నీకు

విచారం వద్దు. నీకు జరిగిన అపచారానికి నేను తప్పక ప్రతిక్రియ చేసితీరుతాను," అని మాట ఇచ్చాడు.



వజీరుసావీ సుల్తానుగారిని పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించి, అలీనూర్ కోసం నగరమంతటా చాటింపు వేయించాడు: అలీనూర్‌ను పట్టి ఇచ్చినవారికి వెయ్యి దీనారాలు బహుమానం; అతన్ని దాచినవారికి శిరచ్ఛేదం!

అయితే ఇన్ని ప్రయత్నాలూ విఫలమయాయి. అలీనూర్ జాడ ఎవరూ చెప్పలేకపోయారు.

కొంతకాలానికి అలీనూర్ ఎక్కిన పడవ బాగ్దాదునగరం చేరింది. పడవసరంగు అలీనూర్‌తో, "అయ్యా, ఇదే బాగ్దాదు మహానగరం! భూలోకస్వర్గం! ఇక్కడే మీరు దిగవలిసింది!" అన్నాడు.

పడవ కేవుకుగాను అయిదు దీనారాలిచ్చి అలీనూర్ ప్రియసఖితోకూడా పడవ దిగాడు. దైవవశాన వారు బాగ్దాదునగరానికి రహదారిన వెళ్ళక మరొక దారి పట్టుకున్నారు. ఈదారి వారిని బాగ్దాదునగరం వెలపల ఉండే ఉద్యానవనాల మధ్యకు తీసుకుపోయింది. వారు ఒక ఉద్యానవనం వద్దకు చేరుకున్నారు.

అది ఖలీఫాగారి ఉద్యానవనం. దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ వున్నది. ముఖద్వారానికి పైగా రంగురంగుల దీపాలున్నాయి. ద్వారం వెలపల ఎవరైనా కూర్చోవటానికి బల్లలున్నాయి. ద్వారం మూసివున్నది. దానిపక్కనే జలయంత్రం ఒకటి వున్నది.

"ఇది చాలా అందమైనచోటు. ఇక్కడ బల్లలమీద కాస్సేపు విశ్రాంతితీసుకుందాం," అన్నాడు అలీనూర్ ప్రియసఖితో. వారిద్దరూ జలయంత్రంవద్ద కాళ్ళూ, చేతులూ, ముఖాలూ కడుక్కొని కొయ్య బల్లలమీద నడుమువాల్చారు. చల్లని పిల్లగాలి వారిని

జోకొట్టింది. వారు తమ బట్టల చెరగులు ముఖానకప్పుకుని నిద్రపోయారు.

వీరిద్దరూ చేరిన ఉద్యానంపేరు ఆనందోద్యానం. దీనిమధ్య ఒక మహలున్నది, దాని పేరు చిత్రమహలు. ఖలీఫాకు మనసు చికాకుగా వున్నప్పుడు ఆయన ఇక్కడికి వచ్చి తన చికాకులన్నీ మరిచిపోతాడు. ఉద్యానం మధ్యవున్న మహలంతా ఒకటే గది. ఆ గదికి నలభై అయిదు కిటికీలున్నాయి. ఒక్కొక్క కిటికీలోనూ ఒక్కొక్క దీపం వేలాడుతూ వుంటుంది. మహలు మధ్యలో బంగారంతో చేసిన పెద్ద దీపం వున్నది. ఖలీఫా వచ్చినప్పుడు మాత్రమే ఈ మహలు తెరిచి, కిటికీలు తెరిచి, దీపాలు వెలిగిస్తారు; మహలు మధ్య ఒక ఆసనం ఏర్పాటు చేస్తారు; దానిమీద సుఖాసీనుడై ఖలీఫా నృత్యగాన వినోదాలు చూస్తాడు. ముఖ్యంగా ఖలీఫాగారి ఆస్థానగాయకుడు ఇసాక్ తన అద్భుతమైన పాటలతో ఖలీఫా విచారాలన్నిటినీ పోగొడతాడు.

ఈ తోటనూ, మహలునూ కనిపెట్టి వుండటానికి ఖలీఫాగారు ఇబ్రాహీం అనే ఒక వృద్ధుణ్ణి ఏర్పాటుచేశాడు. దారేపోయేవాళ్లు తోటలో ప్రవేశించకుండానూ, పూలు దొంగిలించటానికి స్త్రీలూ, పళ్ళకోసం పిల్లలూ రాకుండానూ ఇబ్రాహీం కాపలావుండేవాడు.



ఈరోజు సాయంకాలం అతను తన అలవాటుచొప్పున తోట అంతా చుట్టివస్తూ ద్వారం సమీపంలోగల బల్లలపైన ఇద్దరు వ్యక్తులు పడుకుని వుండటం చూశాడు.

"ఏమి వీళ్ళసాహసం! ఖలీఫాగారు నన్నిక్కడ వేడుకకు వుంచారని వీళ్ల వుద్దేశమా? ఖలీఫాగారి పరివారం కోసం ఏర్పాటయిన బల్లలపైన నిర్భయంగా పడుకుంటారా?" అనుకుని ఒక బరికె తీసుకుని వారివద్దకు వచ్చాడు. కాని అంతలోనే అతన్ని అంతరాత్మ మందలించింది. "ఇదేం పని, ఇబ్రాహీం? వారెవరోకూడా నీకుతెలీదే! అల్లా పంపిన అతిథులుకావచ్చు, దిక్కులేని ముష్టివాళ్ళుకావచ్చు!" అనుకుంటూ ఆ ముసలివాడు వారిద్దరి ముఖాలమీదా కప్పి వున్న బట్టలు తొలగించి, వారి అందంచూసి నివ్వెరపోయాడు.

అతని కోపం పశ్చాత్తాపంగా మారింది. అతను అలీనూర్ కాళ్ళదగ్గిర కూచుని కాళ్ళు పత్తసాగాడు. ఈ స్పర్శకు అలీనూర్ మేలుకుని చివాలున లేచి కూచున్నాడు. తనకు కాళ్ళు పట్టుతున్నవాడు వృద్ధుడని తెలుసుకుని, ఇబ్రాహీం చెయ్యి తీసుకుని తన కళ్లకు అద్దుకున్నాడు.

"మీరిద్దరూ ఎక్కడివాళ్ళు, నాయనా?" అని అడిగాడు తోటమాలి.






"పరదేశీలం!" అన్నాడు అలీనూర్.

"అతిథులను ఆదరించమని అల్లా నిర్దేశం. నా తోటా, మహలూ చూతురుగాని రండి!" అన్నాడు తోటమాలి ఇబ్రాహీం.

"ఇదంతా తమ సొత్తేనా?" అన్నాడు అలీనూర్ ఆశ్చర్యంగా.

ఖలీఫా పేరు చెబితే కుర్రవాడు బెదిరి పోతాడేమోనని ఇబ్రాహీం, "అవును, నాయనా! అంతా నాదే!" అన్నాడు.

ప్రియసఖికూడా లేచింది. ఇద్దరూ తోట మాలి వెంట లోపలికి వెళ్ళారు. అలీనూర్ బస్రాలో ఎంతో గొప్ప ఉద్యానాలు చూశాడు, కాని ఇంత అందమైన ఉద్యానం ఉంటుందని అతను కలలోకూడా అనుకోలేదు. ద్వారందాటి లోపలికి వెళ్ళే దారిపొడుగునా నగిషీ చేసిన కొయ్యలతో ఆర్చీలున్నాయి. వాటికి ద్రాక్షతీగెలు పాకి, వాటిన పళ్లగుత్తులు ఎర్రగా, నల్లగా వేళ్ళాడుతున్నాయి. దారికి రెండు వేపులా ఎత్తయిన ఫలవృక్షా లున్నాయి. వాటిపైన రకరకాల పక్షులు చేరి పాడుతున్నాయి. ఇక ఆ తోటలో పూల చెట్లుగురించి చెప్పనే అక్కర్లేదు. అక్కడ పూయని పూవు లేదు.

ఇబ్రాహీం తన అతిథులకు తోట చూపించి వారిని మహలులోకి తీసుకు పోయాడు. లోపలికి అడుగు పెట్టగానే వారిద్దరికీ కళ్ళు చెదిరిపోయాయి. ప్రపంచంలో అంత అందంగా అమర్చిన మహలు ఉండదనిపించింది. వారు దానిని చూడ టానికి చాలా కాలం పట్టింది. చివరకు అలీ నూర్ ఒక కిటికీ వద్దకు వెళ్లి బయట వున్న తోటను చూశాడు. బయట నిండు వెన్నెల కాస్తున్నది. అతను ఆ క్షణంలో తన కష్టా లన్నీ మరిచిపోయాడు.

ఇబ్రాహీం వారికి ఆహారం తెచ్చిపెట్టాడు. అలీనూర్ అతనితో, "ఇబ్రాహీం, ఆహారంతో బాటు పానీయాలుకూడా ఇవ్వటం ఆచారం గదా! పానీయాలేవీ?" అని అడిగాడు.

ఇబ్రాహీం వెళ్లి ఒక లోటాతో మంచినీరు పట్టుకువచ్చాడు. అలీనూర్ నవ్వి, "నేనడిగిన పానీయం ఇది కాదు," అన్నాడు.

"నీకు ద్రాక్ష సారాయం కావాలిలా గుంది. నేను పదమూడేళ్ళక్రితం మక్కాకు వెళ్లి అక్కడ తాగుడు వదిలేశాను. మీకు కావలిస్తే ఇస్తాను," అంటూ ఇబ్రాహీం ద్రాక్ష సారాయం తెచ్చాడు. కాని తన అతిథులు తాగుతూ ఉండటం చూసి అతనికి ఊరుకో బుద్ధిపుట్టలేదు. అతనుకూడా వారితోబాటు తాగనారంభించాడు.

"దీపాలు లేకపోతే బాగాలేదు, వెలిగించమంటావా?" అన్నది ప్రియసఖి ఇబ్రాహీంతో. తాగటంవల్ల ఒళ్ళు తెలిసీ తెలియకుండా ఉన్న తోటమాలి ఒక్కదీపం వెలిగించటానికి అనుమతి ఇచ్చాడు. కాని అలీనూర్ లేచి వెళ్ళి మహలులో ఉన్న కిటికీలన్నీ తెరిచి దీపాలన్నీ వెలిగించాడు.

సరిగా ఈ సమయానికి ఖలీఫా తన భవనంలో కిటికీ వద్ద నిలబడి ఉండటం జరిగింది. ఆయన చూపునది మీదుగా ఆనందోద్యానంవేపు తిరిగేసరికి దేదీప్యమైన కాంతి కంటబడింది. ఆయన వెంటనే తన వజీరైన జాఫర్‌ను పిలిచి, "అసమర్థుడా, ఈ నగరంలో ఏం జరిగేదీ తెలుసుకోవా? బాగ్దాదును శత్రువులు కొల్లగొట్టుకుపోయినా నీకు



తెలియదులాగుందే? చూడు, చిత్రమహలులో దీపాలు ఎలా వెలుగుతున్నాయో! నేను ఖలీఫాగా ఉండగా ఇది ఎలా జరిగిందీ?" అన్నాడు.

వజీరు జాఫర్ వెలుగు చూశాడు. ఏ మనాలో ఆయినకు తోచక, "హుజూర్, కిందటి వారం ఇబ్రాహీం నాదగ్గిరికి వచ్చి తన మనవడికి చిత్రమహలులో ఉపాకర్మ చేయించుకోవటానికి అనుమతి వేడాడు. నేను తమవద్దనుంచి అనుమతి పొందుదామనుకుని అలాగే లెమ్మన్నాను. తరవాత ఆ విషయమే పూర్తిగా మరిచిపోయాను!" అని బొంకాడు.

"అది రెండో తప్పు. మనం ఏదన్నా కానుకలు పంపిస్తామనే ఆశతోనే ముసలి ఇబ్రాహీం తన మనవడి ఉపాకర్మ గురించి ఎత్తి ఉంటాడు. నువ్వేమీ కానుక ఇవ్వక పోగా నేను ఇచ్చే అవకాశంకూడా లేకుండా చేశావు!" అన్నాడు ఖలీఫా.

"ఏలినవారు నా తప్పులు క్షమించాలి," అన్నాడు జాఫర్.

"క్షమించాం. కాని ఈ రాత్రి ఇబ్రాహీంతో గడపడానికి నిశ్చయించాను. వాడు చాలా యోగ్యుడు, దైవచింత గలవాడు. ఈ సమయానికి వాడు తత్వజ్ఞానుల నందరినీ చేర్చి మంచిమాటలు చెవిని వేసుకుంటూ ఉంటాడు. మనం అక్కడికి వెళదాం. మనం రావటంచూసి ముసలివాడు చాలా సంతోషిస్తాడు," అన్నాడు ఖలీఫా.

జాఫర్‌కు గుండె జారిపోయింది. చాలా పొద్దుపోయిందనీ, ఈ పాటికి ఉపాకర్మ పూర్తి అయి అందరూ ఎవరిదారిన వారు వెళ్ళిపోతూ ఉంటారనీ ఆయన ఖలీఫాకు చెప్పిచూశాడు. కాని ఖలీఫా వెళ్లి తీరాలన్నాడు. అయినా, జాఫర్, దండనాయకుడు మస్రూర్, ఈ ముగ్గురూ వర్తకుల వేషాలు వేసుకుని బయలుదేరారు.

[ముగింపు వచ్చే సంచికలో]






# 8

[దీపంభూతం సహాయంతో అలాదీన్ తన దారిద్ర్యాన్ని పోగొట్టుకోవటమే గాక, రాజకుమార్తెను పెళ్ళాడి, రాజభవనాని కెదురుగా ఒక అద్భుతమైన భవనం కట్టుకుని, అందులో సుఖంగా జీవిస్తున్నాడు. పేదలను కనిపెట్టివుంటూ ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నాడు. అతని జీవితం మూడు పూవులూ, ఆరు కాయలూగా ఉన్నది. అయితే—]

ఆనాడు అలాదీన్‌ను భూమి అడుగున గుహలో బంధించి తన దేశానికి తిరిగిపోయిన మొరాకో మాంత్రికుడు అలాదీన్ తిండికి మాడి చనిపోయాడనే అనుకున్నాడు. తన చేతికి అద్భుతదీపం రానందుకు ఆయన చాలా చిరాకుపడ్డాడు. రోజూ ఆ దీపం జ్ఞాపకం వచ్చేది. వెంటనే అలాదీన్ మూర్ఖత్వంమీద పట్టరాని ఆగ్రహంకూడా వచ్చేది.

ఒకనాడు మాంత్రికుడికి ఆ దీపాన్ని, అలాదీన్ శవాన్నీ కనీసం ఒకసారి చూసి సంతోషించాలని కోరిక కలిగింది. ఇందుకుగాను ఆయన ముగ్గులువేసి, మంత్రాలు చదివి, ముగ్గులమధ్య కూచుని అంజనం వేసి పరీక్షగా చూశాడు. ఆయనకు గుహ కనిపించిందిగాని అందులో దీపం లేదు, అలాదీన్ శవం అసలే లేదు!

మాంత్రికుడికి ఒళ్లంతా జెర్రులు పాకినట్టయింది. అలాదీన్ ఆ దీపంతోసహా ఆ గుహనుంచి బయటపడ్డట్టు ఆయనకు అర్థమయింది. ఆయన పళ్లు పటపటా కొరుకుతూ,

బి. ప్రసాదరావు




"ఓరీ దౌర్భాగ్యుడా! నన్నే ధిక్కరించి అద్భుతదీపం కాజేస్తావురా? చూడు నా తడాఖా!" అని అరిచాడు.

ఆయన ఆరోజే ప్రయాణంకట్టి, ఎక్కడా మజిలీ చెయ్యకుండా, నేరుగా చీనాదేశానికి వచ్చి, ముఖ్యపట్టణం చేరుకుని, ఒక సత్రంలో బసచేశాడు.

మాంత్రికుడు మర్నాడుదయమే నగరం నాలుగు మూలలూ చూడటానికి బయలుదేరాడు. ఎక్కడికి వెళ్లినా అలాదీన్ పేరు చెప్పుకునేవాళ్లే! అలాదీన్ ఎంత అందగాడు! ఎంత గొప్పదాత! ఎంత సంపన్నుడు! మాంత్రికుడికి ఈ ప్రశంసలు వింటున్నకొద్దీ మండిపోయింది. "మీ నోళ్లతోనే మీరు అలాదీన్ చావు కోరుతారు, చూస్తూండండి!" అనుకున్నా డాయన.

ఊరువెంబడి తిరుగుతూ మాంత్రికుడు అలాదీన్ భవనం ఎదటికి వచ్చాడు. "దర్జీ వాడి కొడుక్కి ఇంత దశ పట్టిందిగా! కూటికి టికాణా లేనివాడివి ఐశ్వర్యవంతుడి వయావా? ఒరే అలాదీన్, మీ అమ్మచేత మళ్లీ నూలు వడికిస్తాను చూసుకో! నిన్ను పూడ్చేటందుకు గొయ్యి నాచేత్తో స్వయంగా తవ్వుతానురా!" అని ఆయన తన మనస్సులో ప్రజ్ఞలు పలికాడు.

ద్వారపాలకులను అడగగా అలాదీన్ చాలా రోజులక్రితం వేటకు బయలుదేరినట్టు తెలిసింది. ఇది విని మాంత్రికుడు చాలా సంతోషించాడు. ఎందుకంటే అలాదీన్ లేక పోయినట్టయితే తన పాచిక మరింత బాగా పారుతుంది. పోతే, అలాదీన్ దీపాన్ని ఇంటి దగ్గిర విడిచివెళ్లాడో, లేక తనవెంట తీసుకు పోయాడో తెలియలేదు.

ఈ విషయం తెలుసుకునేటందుకుగాను మాంత్రికుడు తన బసకు తిరిగివచ్చి అంజనంవేసి, దీపం అలాదీన్ భవనంలోనే ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆయనకు పట్టరాని ఆనందం కలిగింది. ఆయన వెంటనే

రాగిపనివాళ్లుండే చోటికి వెళ్లి, పన్నెండు రాగిదీపాలు కొనుక్కుని, వాటిని ఒక గంపలో పెట్టుకుని, "కొత్త దీపాలు! కొత్త దీపాలు! పాతదీపాలు తీసుకుని కొత్త దీపాలిస్తాం!" అని అరుచుకుంటూ అలాదీన్ ఇంటికేసి బయలుదేరాడు. మాంత్రికుడి నెత్తిన ఉన్న పెద్ద తలపాగా, ఆయన చేస్తున్న వింతబేరమూ వీధిలో ఆడుకునే కుర్రాళ్లను ఆకర్షించాయి; వారు ఆటలు మానేసి మాంత్రికుడి వెంట పడ్డారు.

అలాదీన్ భవనం చేరినాక మాంత్రికుడు ఆ ప్రాంతంలోనే తారట్లాడుతూ, "పాత దీపాలకు కొత్త దీపాలిస్తాం!" అని అరవ సాగాడు. తొంభైతొమ్మిది కిటికీల బురుజులో ఉన్న రాజకుమార్తె మాంత్రికుడి అరుపులూ, పిల్లల కేకలూ విని బయటికి తొంగిచూసింది. ఇదంతా చూడగానే ఆమె నవ్వింది, ఆమె దాసీలుకూడా కిలకిలా నవ్వారు.

వారిలో ఒకతె తన యజమానురాలితో, "అమ్మా, నేను అయ్యగారి గది తుడిచే టప్పుడు అక్కడ పీటమీద పెట్టిఉన్న పాత రాగిదీపం ఒకటి చూశాను. దాన్ని తీసుకు పోయి ఆ దీపాలమ్మేవాడికి చూపించి, దానికి బదులుగా నిజంగా కొత్తదీపం ఇస్తాడేమో చూడనా?" అన్నది.



దాసీది చూసిన దీపం అద్భుతదీపమే. అలాదీన్ వేటకు బయలుదేరేముందు దాన్ని దాచటం మరిచాడు. విధిని తప్పించు కోవటం ఎవరికిమాత్రం సాధ్యమవుతుంది? రాజకుమార్తెకు, పాపం, ఆ దీపం గురించి కొంచెంకూడా తెలియదు. ఆమె దాసీ దానితో, "అవునే! అలాగే చేద్దాం. మన పాతదీపాన్ని బానిసవాడిచేత పంపించి కొత్త దీపం అడగమని చెప్పు. ఆ పిచ్చిముండా కొడుకు నిజంగా కొత్తదీపం ఇచ్చాడా, మనం కలకాలం నవ్వుకోవచ్చు!" అన్నది.

దాసీది అలాదీన్ గదికి వెళ్లి అక్కడఉన్న దీపాన్ని తీసుకుని ఒక బానిసకు ఇచ్చింది.



వాడు దాన్ని పట్టుకుపోయి మాంత్రికుడికి చూపి, "అమ్మగారు, ఈ దీపానికి కొత్త దీపం పట్టుకురమ్మన్నారు!" అన్నాడు.

మాంత్రికుడు అద్భుతదీపాన్ని గుర్తించి వణికిపోసాగాడు.

"కంగారుపడుతావెందుకు? ఈ దీపానికి కొత్తదీపం ఇవ్వవా?" అని అడిగాడు బానిస.

మాంత్రికుడు తన ఉద్రేకాన్ని నిగ్రహించుకుని, బానిస చేతిలోఉన్న అద్భుత దీపాన్ని లాక్కుని, తన గంప చూపించి, "నీ యిష్టంవచ్చిన దీపం తీసుకో," అన్నాడు.

బానిసవాడు రాగిదీపం ఒకటి తీసుకుని విరగబడి నవ్వుతూ వెళ్లిపోయాడు.

ఈలోపల మాంత్రికుడు తన గంపనూ, అందులో మిగిలిన రాగిదీపాలనూ తనవెంట ఉన్న పిల్లల మూకమీద గిరవాటువేసి, అద్భుతదీపాన్ని పట్టుకుని ఒక నిర్జన ప్రదేశానికి వెళ్లి, అక్కడ దీపాన్ని రుద్దాడు. వెంటనే దీపంభూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది.

"అలాదీన్ భవనాన్ని ఉన్నపాళంగా మొరాకో చేర్చు. అలాగే నన్నుకూడా ఆ భవనంలోకి చేర్చు!" అన్నాడు మాంత్రికుడు.

ఆయన కళ్లు మూసి కళ్లు తెరిచేసరికి అలాదీన్ భవనం, అందులో ఉండే సమస్త వస్తువులతోనూ, మొరాకోదేశంలో తోటల మధ్య ఉన్నది; మాంత్రికుడు ఆ భవనం లోపల ఉన్నాడు.

మర్నాడు ఉదయం రాజుగారు తన గది కిటికీనుంచి తన కూతురి ఇంటికేసి చూసి అక్కడ ఏమీ లేకపోవటం గమనించి నిర్ఘాంతపోయాడు. అలాదీన్ భవనం ఉండవలసిన చోట విశాలమైన మైదానం ఉన్నది; అందులో భవనం తాలూకు పునాదుల గోతులు మాత్రం ఉన్నాయి. భవనమేమో అదృశ్యమయింది.

"ఏమిటీ ఆశ్చర్యం? ఏం జరిగింది?" అని రాజుగారు మథనపడుతున్న సమ

యంలో, ఆయనను సభకు తీసుకుపోవటానికి మంత్రి వచ్చాడు. రాజు ఆయనతో, "మంత్రీ, అమ్మాయి ఇల్లు ఏమయింది ?" అని అడిగాడు. రాజుగారికి మతి చలించిందనుకుని, "అదేం ప్రశ్న, మహారాజా ?" అన్నాడు మంత్రి.

"అయితే నీకేమీ తెలియదా ?" అన్నాడు రాజు మరింత ఆశ్చర్యంగా.

"నాకేమీ తెలియదు, మహారాజా," అన్నాడు మంత్రి అయోమయంగా.

"నువు అలాదీన్ ఇంటిని చూడలేదన్నమాట. ఇప్పుడు చూడు," అన్నాడు రాజు, మంత్రిని కిటికీదగ్గిరికి లాక్కుపోయి.

"ఘోరం, ఘోరం! అలాదీన్ భవనం మాయమయింది! ఆ అలాదీన్ మంత్రగాడని ఇప్పుడైనా ఒప్పుకుంటారా, మహారాజా ?" అన్నాడు మంత్రి.

రాజు ఆగ్రహావేశంతో, "ఆ నీచుడు, ఆ మంత్రగాడు, ఆ వంచకుడెక్కడ ? అలాదీన్ ఎక్కడ ?" అన్నాడు.

"మహారాజా, అతను వేటకు వెళ్ళాడు. ఇవాళే తిరిగి రావాలి! నే నతనికి ఎదురు వెళ్లి ఆ భవనాన్ని ఏం చేశాడో తెలుసుకు రమ్మని శలవా ?" అన్నాడు మంత్రి, తాను ఇంతకాలానికి అలాదీన్‌మీద జయంసంపాయించినందుకు సంతోషిస్తూ.





"ఏమీ అవసరం లేదు. ఆ వెధవను చేతులూ కాళ్ళూ కట్టి నా దగ్గిరికి ఈడ్చుకు రమ్మని సర్దారుకు చెప్పు." అన్నాడు రాజు.

మంత్రి రాజాజ్ఞను సర్దారుకు తెలిపాడు. సర్దారు నూరుమంది భటులను వెంటబెట్టుకుని అలాదీన్‌కు ఎదురువెళ్ళాడు. నగర ద్వారం దాటి కొంతదూరం వెళ్ళేసరికి అలాదీన్ తగిలాడు. వెంటనే రాజభటులు అతన్ని చుట్టుముట్టారు.

సర్దారు అలాదీన్‌తో, "ఏలినవారు నన్ను క్షమించాలి, నేను రాజుగారి నౌకరును, ఆయన ఆజ్ఞ పాలించి తీరాలి. తమరికి సంకెళ్లు వేసి ఈడ్చుకు రమ్మని రాజుగారు నన్ను ఆజ్ఞాపించారు. మీకు ఎంతగానో రుణపడి ఉన్నాను. అందుచేత నన్ను మీరు క్షమించాలి!" అన్నాడు.

ఆశ్చర్యంతో అలాదీన్ కాస్సేపు ఏమీ అనలేకపోయాడు. చివరకతను, "నేను చేసిన అపచారమేమిటో రాజుగారు చెప్పారా? ఎందుకంటే నేను ఆయనకుగాని, ఆయన రాజ్యానికిగాని ఎట్టి ద్రోహమూ చేసి ఎరగను!" అన్నాడు.

"నాతో రాజుగారు ఏమీ చెప్పలేదు," అని సర్దారు జవాబిచ్చాడు.

"అయితే మీ విధి మీరు నిర్వహించండి!" అంటూ అలాదీన్ తన గుర్రం మీదినుంచి దిగాడు. సర్దారు అతని చేతులు కట్టేసి, అతని నడుముకు గొలుసు కట్టి చేత పట్టుకుని తన గుర్రంమీద సవారీ చేస్తూ నగరానికి తిరిగివచ్చాడు.

సర్దారూ, రాజభటులూ అలాదీన్‌ను కట్టి తెస్తూ నగరంలో ప్రవేశించగానే ఈ దృశ్యం పౌరుల కంటబడింది. ఎందుకో రాజుగారు అలాదీన్‌ను శిరచ్ఛేదం చెయ్యబోతున్నారని వారు గ్రహించారు. వారికి అలాదీన్‌పై అంతులేని ప్రేమ. అందుచేత ప్రజలు కత్తులూ, బాకులూ, కర్రలూ, రాళ్ళూ తీసుకుని సర్దారు వెనకే నడవసాగారు. త్వరలోనే




ఈ గుంపు వందలసంఖ్య దాటి వేలసంఖ్యలో పడింది. క్షణక్షణానికీ వారి ఉద్రేకం రెచ్చిపోసాగింది.

నూరుమంది భటులున్నప్పటికీ సర్దారు అలాదీన్‌ను రాజప్రాంగణంలోకి తీసుకు పోవటం ఎంతో కష్టసాధ్యమయింది. ప్రజలు ఆకలిగొన్న తోడేళ్లలాగా ఉన్నారు. అలాదీన్ లోపల ప్రవేశించగానే వారు భయంకరంగా అరుస్తూ, "అలాదీన్‌ను విడిపించాలి!" అని నినాదాలు చేయసాగారు.

రాజు చాలా కోపోద్రేకంలో ఉన్నాడు. అలాదీన్ తన ఎదటికి రాగానే ఆయన జరిగినదానికి సంజాయిషి అడగటానికి మారుగా, "ఈ దుర్మార్గుడి తల వెంటనే తీసెయ్యండి!" అని భటులకు ఉత్తరువిచ్చాడు.

తలారి వచ్చి అలాదీన్ సంకెళ్లు విప్పి, అతని కళ్ళకు గంత కట్టి, వధ్యస్థానానికి తీసుకుపోయి, "మోకరించి దైవధ్యానం చేసుకో!" అన్నాడు. కాని అతను కత్తిఎత్తి అలాదీన్ తల తెగవేసే లోపుగా బయటవున్న ప్రజలు ప్రహరీగోడ ఎక్కి లోపలికి దూకసాగారు. కొందరు రాజద్వారాన్ని పగలగొట్టే ప్రయత్నాలు సాగించారు.

రాజు తలారితో, "ఆగు!" అన్నాడు. ఆయన సర్దారుకేసి తిరిగి, "అలాదీన్ తల తీసెయ్యటంలేదని ప్రజలతో చెప్పు," అన్నాడు. సర్దారు ప్రజలతో ఈ మాట చెప్పినమీదట ప్రజల ఆగ్రహం కొంత శాంతించింది. వారు ద్వారాన్ని పగలగొట్టే ప్రయత్నమూ, గోడలమీదికి పాకే యత్నమూ మానుకున్నారు.

అలాదీన్ కళ్లకు కట్టిన గంతలు విప్పారు. అతను లేచి నిలబడి గద్గద స్వరంతో, "మహారాజా, నాకింత అవమానం ఎందుకు చేశారో సెలవిస్తారా? నావల్ల జరిగిన అపరాధమేమిటి?" అని అడిగాడు.

"ఏమి అపరాధం జరిగినదీ నీకు తెలియదేం? చూపిస్తాను, నావెంట రా?"

అంటూ రాజు అలాదీన్‌ను రాజభవనం వెనకవేపుకు తీసుకుపోయాడు. అక్కడ తన భవనం లేకపోవటం అలాదీన్ గమనించాడు. అతని కళ్లు మసక అయిపోయాయి. అతని నోట మాట రాలేదు.

"పరమ నీచుడా, నా కూతురు ఏమయింది? నా ప్రాణానికి ప్రాణమైన కూతురు! నా ఏకైక పుత్రిక!" అన్నాడు రాజు ఆగ్రహంతో.

"మహారాజా, నే నేమీ యెరగను," అన్నాడు అలాదీన్.

"విను, నీ దిక్కుమాలిన భవనం నా కక్కర్లేదు. కాని నా కూతురిని వెంటనే నాకు చూపకపోయావో నీ తల తీసేస్తాను!" అన్నాడు రాజు.

"మహారాజా, విధిని తప్పించుకోగలమా? నేను చెయ్యని తప్పుకు నా తల అర్పించవలసివుంటే అర్పించే తీరాలి. కాని నా ప్రియమైన భార్యకోసం నేను వెతకవలిసి ఉంది. ఇందుకుగాను నాకు నలభై రోజులు గడువివ్వించండి!" అని అలాదీన్ మనవి చేసుకున్నాడు.

"గడువిచ్చాను, వెళ్ళు. కాని గడువు లోపల నా కూతురిని చూపలేకపోయావో, నువ్వెక్కడ వున్నా పట్టి తెప్పించి శిక్షిస్తాను. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు రాజు వుద్రేకంగా.

అలాదీన్ తల వంచుకుని బయటికి వెళ్ళాడు. అతనిప్పుడు గుర్తుపట్టేలాగ లేడు. దుఃఖంతో అతని రూపమే మారిపోయింది. అతను ఎదురుపడిన వారిని, "నా ఇల్లేమయింది? నా భార్య ఏమయింది?" అని అడగసాగాడు.

"రాజుగారి నిర్దయమూలాన అలాదీన్ మతి కాస్తా పోయింది, పాపం!" అనుకున్నారు ప్రజలు.

అలాదీన్ నేరుగా నగరం విడిచి వెళ్లిపోయాడు. —(ఇంకా వుంది)



# బయటపడని ఊహాసుందరి

విసుగు చెందని విక్రమార్కుడు మళ్ళీ చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుమీదనుంచి శవాన్ని దింపి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానానికేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఈ అర్ధరాత్రివేళ పడుతున్న శ్రమ చూస్తే నాకు ఇంద్రసేనుడి ప్రణయ కథ జ్ఞాపకం వస్తున్నది. అతను ఎంతో దీక్షతో తాను ప్రేమించిన కన్యకోసం వెతికికూడా ఆమెను తెలుసుకోలేక పోయాడు. అతని కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ చెప్పసాగాడు :

పూర్వం ఇంద్రసేనుడనే క్షత్రియ యువకు డుండేవాడు. అతను చిన్నతనం లోనే సమస్త విద్యలూ అభ్యసించి చాలా తెలివిగలవా డనిపించుకుని, పెళ్ళి గురించి ఆలోచించసాగాడు. సామాన్యంగా స్త్రీలు అల్పబుద్ధి గలవారై ఉంటారనీ, వారికి చీరలపైనా, నగలపైనా ఉండే ఆసక్తి

## బేతాళ కథలు





ఈ రాజుగారివద్ద కొలువు చేసేవారిలో ఒక వృద్ధుడైన సామంతు ఉన్నాడు. ఆయన పేరు చంద్రవర్మ. ఊరి వెలపల కొండల మధ్య అయన కొక పెద్ద భవనం ఉన్నది. అందులో ఆయన బంధుబలగం దాదాపు నూరుమందిదాకా ఉన్నారు. వారిలో పెళ్లి కావలిసిన కన్యలు ఎంతోమంది ఉన్నారు. ఇంద్రసేనుడు తన బలగంలో ఎవతెనైనా పెళ్ళాడితే బాగుంటుందని చంద్రవర్మ అభి ప్రాయపడ్డాడు. ఆయన ఒకనాడు ఇంద్ర సేనుడితో, "మన రాజుగారు నెలరోజుల పాటు తీర్థయాత్రలు చేయబోతున్నారు. ఆ నెలరోజులూ నీవు మా ఇంటికి వచ్చి ఉండాలి," అని ఆహ్వానించాడు. ఇంద్ర సేనుడు సరేనన్నాడు.

రాజుగారు యాత్రకు బయలుదేరిన రోజే ఇంద్రసేనుడు చంద్రవర్మ ఇంటికి వెళ్లాడు. చంద్రవర్మ ఉండే ఇల్లు రాజభవనానికి ఏమాత్రమూ తీసిపోదు. అయితే ఇక్కడ రాజభవనంలో ఉండే నిర్బంధాలేమీ లేవు. ఎవరు పడితే వారు ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళవచ్చు.

ఆ భవనం చుట్టూ రకరకాల పళ్ల తోటలూ, పూలతోటలూ ఉన్నాయి. కొద్ది దూరంలో కొండలున్నాయి.

ఇతర విషయాలమీద ఉండదనీ, వారు గంభీరమైన విషయాలను గురించి ఆలో చించనే లేరనీ అతని నమ్మకం. అలాటి స్త్రీని పెళ్ళాడటం అతనికి ఎంతమాత్రమూ ఇష్టంలేదు. చురుకైన బుద్ధీ, అసాధారణ మైన తెలివితేటలూ, నిబ్బరమైన మనస్సూ గల కన్యనే అతను పెళ్ళాడ నిశ్చయించాడు. అతనికి కావలసిన కన్య ఎక్కడా ఉన్నట్టు కనబడలేదు.

ఇంద్రసేనుడికి ఒక రాజుగారివద్ద కొలువు దొరికింది. అతను వయసుకు చిన్నవాడైనా, తెలివితేటలలో పెద్దవాడేనని రాజుగారికీ, ఇతర రాజోద్యోగులకూ తెలిసిపోయింది.





ఇక్కడికి వచ్చిన క్షణం నుంచీ ఇంద్రసేనుడికి స్వర్గంలోకి వచ్చినట్టుగా ఉన్నది. అతనికి చాలా స్వేచ్ఛ లభించింది. వచ్చిన రోజునే అతను చంద్రవర్మ బంధువులందరినీ పరిచయం చేసుకున్నాడు. వారిలో కన్యలు చాలామంది ఉన్నారు. కొందరు అందగత్తెలు కూడానూ. కాని వారి తెలివితేటలను గురించి ఇంద్రసేనుడు ఏమీ తెలుసుకోలేకపోయాడు. ఆ విషయంలో వారు ఇతర స్త్రీలలాగే ఉన్నట్టు కనబడ్డారు.

చంద్రపర్మ ఇంటికి అతిథిగా వచ్చిన మర్నాడే ఇంద్రసేనుడికి కొండల మీదికి ఒంటిగా వెళ్లాలనిపించింది. ముఖ్యంగా శిఖరాలమీద కూచుని, నాలుగువైపులా కలయజూస్తూ, నిర్మలమైన గాలి పీల్చటం అతనికి చాలా ఇష్టం.

అయితే అతను ఎక్కిన కొండమీద సగంవరకే కాలిబాట ఉన్నది. శిఖరానికి ఎక్కాలంటే పాదల సహాయంతో రాళ్ల మీదుగా పాకుతూ ఎక్కాలి. అది చాలా అపాయకరం. అందుచేతనే ఆ శిఖరం మీదికి ఎవరూ ఎక్కిన జాడలు లేవు.

"ఎవరూ ఎక్కని ఈ శిఖరాన్ని నాది చేసుకుంటాను. ఇక్కడ ఉన్నంతకాలమూ రోజూ ఇక్కడికి వస్తాను," అనుకుని ఇంద్రసేనుడు ఆ శిఖరం పైకి ఎంతో కష్టపడి పాకాడు. శిఖరం మీద సమప్రదేశంగా ఉన్నది. దాని మధ్యలో చిన్న నీటిమడుగున్నది. అందులో తెల్లని పద్మాలున్నాయి. ఈ గుంటచుట్టూ కూర్చోవటానికి వీలైన నున్నని బండశిలలున్నాయి. ఆ దృశ్యం చూసేసరికి ఇంద్రసేనుడు ఆనంద పరవశుడయాడు. కాని అతను ఆ నీటిమడుగు పక్కన ఒక బండమీద కూచోబోయే సమయానికి ఆ బండమీద వాడి నలిగిపోయిన పూలు కొన్ని కనిపించాయి.

వాటిని చూసి ఇంద్రసేనుడు ఆశ్చర్యపోయాడు. ఆ పూవులు అక్కడ ఉన్న

మొక్కలకు పూసినవి కావు; ఒక స్త్రీ తలలో నుంచి రాలినవి. ఎవరో స్త్రీ ఇక్కడికి ఏకాంతంగా వచ్చి కూచుంటున్నది. అలా చేసే స్త్రీ అందరి స్త్రీలవంటిది అయిఉండ దని అతనికి తోచి ఆమెమీద కొంత మంచి అభిప్రాయం ఏర్పడింది.

ఆ స్త్రీనిగురించి ఇంకా తెలుసుకోవాలని ఇంద్రసేనుడికి కుతూహలం పుట్టుకొచ్చింది. అతను ఆమె విడిచిపోయిన వస్తువులింకే మైనా ఉన్నాయేమోనని అక్కడ అంతటా వెతికాడు. ఒక బండరాయి పక్కన ఒక తాటి ఆకు కనిపించింది. దాన్ని తీసి చూసే సరికి దానిమీద ఈ విధంగా రాసి ఉన్నది:

"స్త్రీకి ఉత్తముడైన భర్త దొరకటం కంటె గొప్ప అదృష్టం లేదు. పురుషులు సాధారణంగా స్వార్థపరులు. అందుకే వారు స్త్రీల బుద్ధిహీనతను సహిస్తారు. నాకు ఎలాటి భర్త దొరుకుతాడో. నన్ను అర్థం చేసుకోలేని భర్తను చేసుకోవటంకంటె పెళ్లి కాకుండా ఉండిపోవటమే మేలు."

ఇలాటి తాటాకులు ఇంకా రెండుమూడు దొరికాయి. వాటిమీదకూడా ఆ స్త్రీ ఇలాటి భావాలే రాసింది. ఆమె అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చి తనకు తోచే భావాలను తాటి ఆకులపైన రాసి వదిలిపెట్టి పోతూ ఉంటుం దని ఇంద్రసేనుడు గ్రహించాడు.



ఆలోచించినకొద్దీ అతనికి ఈ స్త్రీ తనకు భార్య కాదగినదేనని తోచింది. ఆమె పెళ్ళీడ దగిన వయసులోనే ఉన్నది, కాని అందగత్తె అవునా కాదా? ఈ సంగతి ఇంద్రసేనుడికి తెలియలేదు. ఆమె తన అందంగురించి గాని, తనకు కాబోయే భర్త అందంగురించి గాని ఏమీ రాయలేదు.

ఎలాగైనా ఈ స్త్రీ ఎవరో తెలుసుకోవాలని తీర్మానించుకుని ఇంద్రసేనుడు కొండ దిగి చంద్రవర్మ ఇంటికి తిరిగి వచ్చాడు. చంద్రవర్మ ఇంట ఉన్న కన్యలలో ఇందుముఖీ, వాసంతీ, చంద్రకళా, పద్మినీ, భారతీ మొదలైనవారు చాలామంది ఉన్నారు. వారంతా స్వేచ్ఛగా తిరిగేవారే కనక ఏ ఒకరు ఏ క్షణాన ఎక్కడ ఉన్నదీ అరాతీయటం సాధ్యం కాదు. ఆఖరుకు భోజనాల దగ్గిరకూడా అందరూ కలవరు. ఎవరికి వీలుపడినప్పుడు వారు భోజనాలకు వెళ్ళి భోజనం చేస్తారు.

ఇంద్రసేనుడు అందరితోనూ మాట్లాడి చూశాడు. ఒక్కరుకూడా గొప్ప తెలివితేటలేమీ ప్రదర్శించలేదు; అందరు స్త్రీలలాగే అందచందాలను గురించీ, అలంకరణలను గురించీ, గొప్పగా బతకటం గురించీ మాట్లాడారు. అందుచేత సంభాషణద్వారా ఇంద్రసేనుడు తనకు కావలసిన ఊహాసుందరిని





తెలుసుకోలేకపోయాడు. తన ఊహాసుందరి వీరిలో ఎవరూ కాకపోవచ్చు. ఆమె మామూలు దాసీ అయినా ఆమెనే పెళ్ళాడాలని అతను నిశ్చయించాడు.

ఆమె ఏ సమయంలో శిఖరానికి వెళుతున్నదో కనిపెట్టి ఆ సమయంలోనే తాను కూడా వెళ్లితే ఆమె దొరికిపోతుందని అతనికి తట్టింది. ఇంద్రసేనుడు ఒక వారం పాటు వేరువేరు సమయాలలో ఆ శిఖరానికి వెళ్ళాడు. ఒకరోజు ఒక రాతిమీద చిన్న తాటిఆకు పెట్టి ఉన్నది. దానిపైన "నన్ను తెలుసుకోవటానికిగాను వెంబడించవద్దు. భగవంతుడు మీకు తెలివితేటలిచ్చాడుగదా, వాటిని ఉపయోగించి నే నెవరో తెలుసుకోండి," అని రాసిఉన్నది.

ఇది చూసి ఇంద్రసేనుడు ఆశ్చర్యపోయాడు. తాను చేసే ప్రతిపనీ ఆమె గమనించుతూనే ఉన్నదని స్పష్టమయింది. అంటే ఆమె అతనిపట్ల సుముఖురాలుగానే ఉన్నదన్నమాట. ఆమె ఏమనుకుంటుందోనని అతను ఆమెను తరిమి పట్టుకునే యత్నం మానేసి తన మామూలు అలవాటు చొప్పున సాయంకాలంపూట శిఖరానికి వెళ్లి అక్కడ మంచిమంచి పూలు పెట్టి రాసాగాడు. మర్నాడు అతను వెళ్ళేసరికి ఆ పూలు అక్కడ ఉండేవికావు, వాటికి బదులు వేరే పూలుండేవి.

ఒకరోజు ఇంద్రసేనుడు శిఖరం మీద ఒక ఉత్తరం రాసిపెట్టాడు. "నిన్ను తెలుసుకోవటానికి ఏమాత్రమూ ఆధారం లేకుండా ఉన్నది. నాకు కాస్త సహాయం చెయ్యోగూడదా?" అని అందులో ఆమెను అడిగాడు.

"సహాయం ఇస్తే నన్ను కనుక్కుంటారు. అంతకన్న నేనే బయటపడటం మంచిది కదా. నాకది ఇష్టం లేదు. మీకై మీరు నన్ను కనుక్కోగలిగితేనే మీరు నాకు తగిన భర్త అని రుజువవుతుంది," అని ఆమె సమాధానం రాసింది.

ఇలా మూడు వారాలు గడిచింది. ఆ స్త్రీ మిట్టమధ్యాహ్నంవేళ, అందరూ భోజనం చేసే సమయంలో శిఖరానికి వెళుతున్న దని ఇంద్రసేనుడు అదివరకే ఊహించాడు. ఇక తనకున్న వ్యవధి ఒక్క వారం మాత్రమే. అందుచేత అతను ఆమెను ఒక మధ్యాహ్నం శిఖరం మీదనే కలుసుకుని ఆమె ఎవరో తెలుసుకో దలిచాడు.

అతను కొండమీదికి వెళ్ళేసరికి శిఖరం మీదికి పాకిపోతూ ఒక తెల్లని చీరె కట్టు కున్న స్త్రీఆకారం కనిపించింది. ఇంద్ర సేనుడు ఆత్రంగా శిఖరానికి పాకటానికి యత్నించటంలో మధ్యదారిలో అతనికి కాలు పట్టు తప్పి జారి, కిందికి వచ్చి పడ్డాడు. కాలు బాగా బెణికింది. అతను తల ఎత్తి చూస్తే ఆ స్త్రీ జాడ కనపడలేదు.

అతను బాధతో కుంటుకుంటూ కొండ దిగి రాసాగాడు. సగం దారిలో అతనికి ఒక గుర్రపు రౌతు ఎదురై, "బాబుగారూ, దీని మీద ఎక్కి కూచోండి. ఇల్లు చేర్చుతాను," అన్నాడు వినయంగా.

"నా కాలు బెణికిందని నీకెలా తెలుసు?" అని ఇంద్రసేనుడు రౌతును అడిగాడు.

"అయమ్మగారు చెప్పిపంపారు," అన్నాడు వాడు.



"ఏ యమ్మగారురా ? ఆవిడ పేరేమిటి? ఎలా ఉంటారు ? పొడుగా, కురచా ?" అని ఇంద్రసేనుడు ఎన్నో ప్రశ్నలు వేశాడు. కాని రౌతు ఒక్క ప్రశ్నకూ జవాబు చెప్పలేక పోయాడు. వాడు వట్టి అయోమయం మనిషి.

ఇంద్రసేనుడు ఇల్లు చేరగానే అందరూ వచ్చి సానుభూతి తెలిపారు. అందరినీ అతను ఎంతో శ్రద్ధగా గమనించాడు. ఇందు ముఖి అనే పిల్ల తనకేసి ప్రత్యేకించి జాలిగా చూసినట్టు అతనికి తోచింది. ఆమె చాలా అందగత్తె కూడానూ. ఆమె వచ్చినప్పుడు వెంట ఎవరూ లేరు. అందుచేత అతను ఆమెతో, "నాకు అంతా అర్థమైపోయింది.





కాదు. అయితే మరెవరు? అతనికి అంతు బట్టలేదు. ఆ రాత్రి అతను నిద్రపోయే సమయాన అతని దిండుపైన ఎవరో ఒక ఉత్తరం పెట్టారు. మర్నాడు తెల్లవారి లేస్తూనే అతను ఈ విధంగాచదువుకున్నాడు: "నా కారణంగా మీ కాలు బెణకటం చూసి నాకు మీపైన జాలి ముంచుకొచ్చింది. నన్ను నేను బయటపెట్టుకుందా మనికూడా నిశ్చయించుకున్నాను. అయితే నా నియమం దాటరానిది. మీరు నన్ను తెలుసుకోలేని పక్షంలో మనం వివాహ మాడటం నిరుపయోగం!"

నువ్విచ్చిన పూలూ, ఉత్తరాలూ—" అని ప్రారంభించాడు.

అకస్మాత్తుగా ఇందుముఖి ముఖాన్ని భయం ఆవరించింది. ఆమె నోరు తెరిచి ఏదో అనబోయి అవతలికి పారిపోయింది. తరవాత చంద్రకళ అనే పిల్ల ఒంటరిగా వచ్చి ఇంద్రసేనుడితో అదుర్దాగా, "మా ఇందుముఖి మంత్రికుమారుణ్ణి ప్రేమిస్తున్న సంగతి మీరు ఎలాగో తెలుసుకున్నారట! దయచేసి కొంతకాలంపాటు ఈ విషయం రహస్యంగా ఉంచండి!" అన్నది.

ఇంద్రసేనుడి గుండె జారిపోయినట్ట యింది. తన ఊహాసుందరి ఇందుముఖి

ఇంద్రసేనుడికి మతి పోతున్నట్టయింది. ఆ ఇంట్లో ఉన్న కన్యలందరితోనూ అతను అదివరకే మాట్లాడాడు. ఒక్కరుకూడా తెలివితేటలుగా మాట్లాడలేదు. ఎవరిని కది లించినా అల్ప విషయాలూ, క్షుద్రవిష యాలూ మాట్లాడేవారే. ఒక్కరికీ ఘనమైన అభిరుచులు లేవు. వారితో అతను ఎంతో ఓర్పుగా సంభాషించాడు. ఎవరితో మాట్లాడే టప్పుడైనా చీమతలకాయంత సందు దొరి కితే తన ఊహాసుందరిని గుర్తించుదామని ఎంతో శ్రద్ధగా వారందరి చచ్చు సంభా షణలూ విన్నాడు. కాని కాస్తయినా ప్రయోజనం లేకపోయింది.



రెండుమూడు రోజులలో అతని కాలు బాగయింది. తరవాత వారు నగరానికి తిరిగి పోయే సమయం వచ్చింది. అతను బయలు దేరి వెళ్లే రోజున అతనికి మరొక ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉన్నది.

"మీరు నన్ను పోల్చుకోనే లేదు. నేను పెట్టిన ఒక్క పరీక్షలోనూ మీరు నెగ్గలేక పోయారు. నేను మీ ఎదట పడకుండా దాగాననుకోవద్దు. మనం చాలాసార్లు కలుసు కున్నాం, మాట్లాడుకున్నాం. నన్ను పోల్చు కోవటానికి అన్ని రకాల యత్నాలూ చేశారు గాని, నేను చేస్తారనుకున్న ఒక్క యత్నమూ చేయలేదు. నేను నిరాశ పొందాను. సెలవు."

ఇంద్రసేనుడు హతాశుడైపోయాడు. అతను ఆరోజే చంద్రవర్మతోసహా నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు. తన ఊహాసుందరి ఎవరో అతను తెలుసుకోలేదు.

బేతాళుడీ కథ చెప్పి "రాజా, నాకొక్క సందేహం. ఇంద్రసేనుడి ఊహాసుందరి బయటపడకపోవటానికి నిజమైన కారణ మేమిటి? వద్దన్నప్పటికీ అతను తనను వెంబడించాడని ఆగ్రహించిందా? లేక ఆమెకు అతనిపై ఉండదగినంత ప్రేమ లేకపోయిందా? తనను గుర్తించటానికిగాను అతను ఒక్క ప్రయత్నం చేయలేదని ఆమె ఆక్షేపించిందే, ఆ ఒక్క ప్రయత్న మేమిటి?



ఈ సందేహాలకు సమాధానాలు తెలిసికూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది!" అన్నాడు.

"నీ మొదటి సందేహాలు సరి అయినవి కావు. తనను వెంబడించినందుకు ఆమె ఆగ్రహించి ఉంటే, అతని కాలు జారికిన సందర్భంలో ఆమె అతన్ని పరామర్శించ టానికి వచ్చి ఉండేది కాదు; ఆ విధంగా అతను ఆమెను గుర్తించేవాడు. ఇంద్ర సేనుడు తనకు భర్త కావాలన్న కోరిక ఆమెకు లేకనేపోతే, అతను అక్కడ ఉన్న నెల రోజులూ ఆమె శిఖరానికి వెళ్ళటం మానేసేది; అప్పుడు ఇంద్రసేనుడికి ఏ బాధా ఉండేదికాదు. ఆమె ఆఖరు ఉత్త రంలో చెప్పినట్టు ఇంద్రసేనుడు ఆమెను గుర్తించటానికి ఒక్క ప్రయత్నం చెయ్య లేదు. ఆ ప్రయత్నం ఏమిటో మనం సులు వుగా ఊహించవచ్చు. పురుషులు స్వార్థ పరులనీ, అందుచేతనే వారు స్త్రీల బుద్ధి హీనతను సహిస్తారనీ ఆమె అనుకున్నది. ఆ సంగతి ఇంద్రసేనుడు ఎరుగును. అతను చంద్రవర్మ ఇంట ఉన్న కన్యలతో మాట్లాడే టప్పుడు వారి బుద్ధితక్కువ సంభాషణను సహించాడే గాని, అసహ్యించుకోలేదు. అతన్ని పరీక్షించటానికిగాను అతని ఊహా సుందరికూడా ఇతర స్త్రీలలాగే అతనితో మాట్లాడింది. ఇంద్రసేనుడుకూడా స్వార్థ పరుడు కావటంచేతనే తనతో మాట్లాడే స్త్రీల బుద్ధిహీనతను సహించాడు. లేకపోతే తన ఊహాసుందరికి కోపం వస్తుందేమోనని అతను భయపడాడు. ఇది సర్వసాధార ణంగా అందరు పురుషులూ చేసే పనే. ఈ కారణం వల్లనే అతను ఊహాసుందరిని కోలుపోయాడు," అని విక్రమార్కుడు సమాధానం చెప్పాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు మాయమై శవంతోసహా మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# తిక్కకు శాస్తి

ఒక యాత్రికుడు ఒక అడవిమార్గాన వెళు తూండగా దారిలో చీకటి పడింది. అసలే చలిరోజులు. ఆ చలిలోనూ చీకట్లోనూ పడి నిర్మానుష్యమైన అడవిలో ఎంతదూరం ప్రయాణం చేయాలో అని యాత్రికుడు భయపడుతూ ఉండగా కొద్దిదూరంలోనే ఒక కుటీరం కనబడింది.

బతుకు జీవుడా అని యాత్రికుడు ఆ కుటీరంలో ప్రవేశించాడు. కుటీరం లోపల ఒక నడివయసు మనిషి వంట చేసుకుంటున్నాడు. ఆయనతప్ప ఆ కుటీరంలో ఇంకెవరూ లేరు.

ఒకమూల ఒక పిల్లి చుట్టచుట్టుకుని పడుకుని ఉంది.

"అయ్యా, పరదేశిని, యాత్రికుణ్ణి. చాలా దూరంనుంచి ప్రయాణంచేసి వస్తున్నాను. ఈ నిశివేళప్పుడు ఈ అరణ్యంలో చిక్కుకు పోయాను. ఈ రాత్రికి నాకింత తిండి పెట్టి, ఇక్కడ పడుకోనిస్తే మీ మేలు మరపను," అన్నాడు యాత్రికుడు.

"అందుకేమీ అభ్యంతరం లేదు. నీవు ఈ రాత్రికి నా అతిథిగా వుండి, ఇక్కడే పడుకోవచ్చు. కాని నాకొక ఆచారం ఉన్నది. మా యింటికి అతిథిగా వచ్చేవాడు నేను వేసే ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలివ్వాలి. లేకపోతే చెంపవాయిస్తాను. దానికి ఇష్టమైతే ఉండు, లేకపోతే ముందుకు సాగి వెళ్ళు," అన్నాడు గృహస్థు.

ఆ గృహస్థు తిక్కవాడని యాత్రికుడు గ్రహించాడు. కాని ఇంటిమధ్య వెలుగుతున్న వెచ్చని పొయిమంట చూస్తూంటే అతనికి ముందుకు సాగాలని బుద్ధిపుట్టలేదు. బయట చీకటీ, చలిగాలీ.

"ఈ పెద్దమనిషి అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోతానా?" అనుకుని యాత్రికుడు సరేనన్నాడు.

టి. అహల్యాదేవి

" అయితే తలుపు మూసి లోపలికి వచ్చి కాస్సేపు చలి కాచుకో. ఇంతలో వంట అవుతుంది, భోంచేతాం!" అన్నాడు గృహస్థు.

కొంతసేపటికి ఆయన వంట పూర్తిచేసి, తనకూ అతిథికీ వడ్డన చేశాడు. ఇద్దరూ కడుపునిండా తిన్నారు. భోజనాలు అయిన తరవాత ఇద్దరూ కబుర్లు చెప్పుకోవటానికి స్థిమితంగా కూచున్నారు.

మాటలమధ్యలో గృహస్థు తన అతిథికి మూలనున్న పిల్లిని చూపించి, "అదేమిటి?" అని అడిగాడు.

ఈ మానవుడు ఇంత చిన్న పిల్లవాడి లాగా అడుగుతాడేమా అని ఆశ్చర్యపడుతూ యాత్రికుడు, " అది పిల్లికదా ?" అన్నాడు.

" కాదు ! అది శుచిత్వం ! తెలిసిందా ?" అంటూ గృహస్థు తన అతిథి చెంపమీద ఒక్కటి వేశాడు.

ఈ వింత ప్రవర్తనకు యాత్రికుడు ఆశ్చర్యపోయాడు.

ఇంతలో గృహస్థు మళ్లీ యాత్రికుడికేసి తిరిగి నీటికుండను చూపుతూ, " అందులో ఏమున్నది ?" అన్నాడు.

" నీరు," అన్నాడు యాత్రికుడు.

" కాదు. అందులో ఉన్నది మంచి తనం !" అంటూ గృహస్థు మళ్లీ యాత్రికుడి చెంపమీద కొట్టాడు.



మరి కాస్సేపయాక గృహస్థు యాత్రి కుణ్ణి, "ఆ పొయిలోది ఏమిటి?" అన్నాడు.

"నిప్పు," అన్నాడు యాత్రికుడు.

"కాదు, సౌఖ్యం!" అన్నాడు గృహస్థు. తప్పు చెప్పినందుకు మళ్లీ అతిథి చెంపమీద దెబ్బ పడింది.

ఈసారి గృహస్థు ఇంటికప్పుకేసి చూపి, "అది ఏమిటి?" అన్నాడు.

"కప్పు!" అని యాత్రికుడు సమాధానం చెప్పాడు, మళ్లీ దెబ్బ పడుతుందని అను కుంటూనే.

"కాదు, ఎత్తు!" మళ్లీ యాత్రికుడి చెంప పేలింది.

యాత్రికుడు లేచి, "నా బుర్రంతా వేడెక్కింది. ఒక్కసారి బయటికి వెళ్ళి చల్లగాలి అనుభవించి వస్తాను," అంటూ తలుపు తెరుచుకుని బయటికి వెళ్లాడు.

అదే సమయంలో మూల చుట్టచుట్టు కుని పడుకుని నిద్రపోతూవున్న పిల్లి లేచి, ఒకసారి వళ్లు విరుచుకుని, తానుకూడా బయటికి వెళ్ళింది.

యాత్రికుడు ఆ పిల్లిని పట్టుకుని, దాని తోకకు చితుకులు అంటగట్టి నిప్పు అంటించి, ఆ పిల్లిని కప్పుమీదికి ఎక్కించాడు. తర వాత అతను లోపలికి వచ్చి గృహస్థుతో, "అయ్యా, మీ శుచిత్వం సౌఖ్యాన్ని వెంట బెట్టుకుని ఎత్తుకు పోయింది. మంచితనంతో సౌఖ్యాన్ని అరికట్టండి," అన్నాడు.

గృహస్థుకు ఈ మాట కొంచెంకూడా అర్థం కాలేదు. ఆయన చిరాకుగా, "ఏమిటా అర్థంలేని మాటలు? సరిగా చెప్పి యేడవ రాదా?" అన్నాడు.

"బుద్ధిహీనుడా, నీ ఇంటికప్పు నిప్పంటు కున్నది. వెళ్లి ఆర్పుకో. నీ ఆతిథ్యం చాలు. నా దారిన నేను పోతున్నాను," అంటూ యాత్రికుడు గృహస్థు దవడలు ఎడాపెడా వాయగొట్టి, తన మూట తీసుకుని ఆ చీకట్లోనే పడి వెళ్ళిపోయాడు.






# రాజప్రతినిధులు

మహారణ్యంలో ఒక ప్రాంతంలో జంతువులు అరాజకంగా ప్రవర్తిస్తున్నట్టు మృగరాజైన సింహానికి తెలియవచ్చింది. అక్కడ ఒక రాజప్రతినిధిని ఏర్పాటుచేస్తే అరాజకాన్ని అదుపులో ఉంచటానికి వీలవుతుందని మంత్రి అయిన గాడిద సలహా ఇచ్చింది.

రాజప్రతినిధిగా పంపటానికి ఎలుగుబంటి కన్న అర్హమైన జంతువు లేదు. అందుచేత, యుద్ధంలో ఆరితేరిన ఒక ఎలుగుబంటిని రాజప్రతినిధిగా నియమించారు.

ఎలుగుబంటిని పంపేటప్పుడు గాడిద ఈ విధంగా సలహా చెప్పింది ;

"మన ప్రజలలో రాజభక్తి సడలకుండా చూసేభారం నీమీద ఉన్నది. ఇందుకుగాను కొంత రక్తపాతం అవసరం. రక్తపాతం కలిగించకుండా మనం చరిత్రలోకి ఎక్కటం సాధ్యంకాదుకూడా. అయితే చరిత్ర చాలా అపాయకరమైనది. దాన్ని చూస్తే మన చక్రవర్తిగారికే ఏంతో హడలు! కనుక నీవు మెలకువతో వ్యవహరించాలి!"

ఎలుగుబంటి బయలుదేరి తాను పరిపాలించవలసిన అరణ్యప్రాంతాన్ని చేరుకున్నది. తనకు కొత్త ఉద్యోగం వచ్చినందుకు పండగ చేసుకుందామనే ఉద్దేశంతో అది తాటికల్లు తెగతాగి, మత్తువచ్చి, స్పృహ తప్పి చెట్లమధ్యపడి నిద్రపోయింది.

మరికొంతసేపటికి ఒక పిచ్చుక అటుగా వచ్చి, తాగి పడిఉన్న రాజప్రతినిధిని చూసి ఏదో దుంగ అనుకుని, దాని శరీరంమీదవాలి కిచకిచమని అరవసాగింది. నిద్రమత్తులో ఉన్న ఎలుగుబంటి బలవంతాన కళ్లు తెరిచి, "రాజప్రతినిధి శరీరంమీద వాలిన రాజద్రోహి ఎవడురా?" అని గర్జించింది.

"అరె, ఈ దుంగ మాట్లాడుతున్నదే!" అని ఆశ్చర్యపడుతూ పిచ్చుక రాజప్రతినిధి తలమీద వాలింది. మరుక్షణం ఎలుగుబంటి

టి. శంభుదాసు

పిచ్చుకను తన నోట్లోకి తీసుకుని ఒక్క గుటకలో మింగేసింది.

వెంటనే చుట్టుపక్కల ఉన్న చెట్లమీది నుంచి నవ్వులు వినిపించాయి. "ఏహెహె! రాజప్రతినిధి పిచ్చుకను మింగింది!" అన్నది ఒక కొంగ. "బుద్ధిలేదు! పిచ్చుకను మింగింది!" అన్నది కాకి.

క్షణంలో అడవి అంతటా నవ్వులు మారుమోగాయి. ఆఖరుకు గుంటలో ఉండే కప్పలూ, దోమలూ, ఇతర క్రిములూకూడా, రాజప్రతినిధి పిచ్చుకను మింగినందుకు నవ్వాయి. అది అల్పులు చేయవలిసిన పని.

త్వరలోనే ఈ వార్త సింహానికి తెలిసింది. "ఈ నీచుణ్ణి రాజప్రతినిధిగా ఎందుకు పంపావు? వెంటనే తిరిగి రమ్మను. ప్రజలను కొరత వెయ్యటానికీ, భయపెట్టటానికీ, పీడించటానికీ పంపితే, ఈ ఎలుగుబంటి చరిత్రలో అపకీర్తి స్థానం సంపాదించుకున్నది!" అని సింహం ఆగ్రహించింది.

అంతటితో ఎలుగుబంటికి రాజప్రతినిధి పదవిపోయి అది ఇంటికి వెళ్ళిపోయింది.

దాని స్థానంలో రాజప్రతినిధిగా పంపటానికి గాడిద మరొక ఎలుగుబంటిని నియమించింది. ఈ ఎలుగుబంటి చాలా తెలివైనది. అది చడీ చప్పుడూ లేకుండా పుద్యోగంలో ప్రవేశించింది. అది ఏనాడూ అరణ్య రాజకీయాల జోలికి పోలేదు. అసలు అది తన రాజభవనందాటి యెక్కడికీ వెళ్లలేదు,

అరణ్యంలో మిగిలిన ప్రాణులు యథేచ్ఛగా ఆనందిస్తూ, కీచులాడుకుంటూ. తాగుతూ, తింటూ తిరుగుతూవుంటే, వాటిని పాలించవలసిన రాజప్రతినిధి వాటిని చూసి అసూయపడుతూ వుండేది. ఇలా ప్రవర్తించినందుకు ఈ ఎలుగుబంటిని అడవి జంతువులు కీర్తించాయి. చరిత్రలో దానికి గొప్ప స్థానం లభించింది. సింహం చాలా సంతోషించి దానికి, "రాజమాన్య" బిరుదుకూడా బహూకరించింది.






## 10

[సముద్రం మీద పడవలసిన పాట్లన్నీ పడి, తన నౌకలన్నిటినీ, అనుచరులనందరినీ కోల్పోయి, ఫైయాసియా తీరాన వచ్చిపడిన రూపధరుడికి మహామేధి మహారాజు ఆతిథ్యమూ, అభయమూ ఇచ్చాడు. రూపధరుడి గౌరవార్థం జరిగిన విందులో అంధగాయకుడు "కొయ్యగుర్రం" కథ గానంచేస్తూ ఉండగా రూపధరుడు కంట తడిపెట్టసాగాడు. అది చూసి మహామేధి తన అతిథిని, "మీరెవరు? మీది ఏ దేశం?" అని ప్రశ్నించాడు.]

రూపధరుడు మహామేధి మహారాజుకు తన ఊరుపేరూ తెలుపుకుని, ట్రోయ్ పతనానంతరం తనకు కలిగిన ఇక్కట్లూ, అనుభవాలూ వివరించి చెప్పాడు. అతను తన కథ ముగించాక మహామేధితో పాటు అందరూ అత్యాశ్చర్యంచెందారు.

చివరకు మహామేధి అక్కడ చేరిన వారితో, "మన అతిథికి ఉమ్మడి ఖర్చులో మన మందరమూ బహుమతులు ఇద్దాం. నేను స్వయంగా ఈయనకు, కొంత బంగారమూ, ఉడుపులూ, ఇతర కానుకలూ ఇస్తున్నాను," అన్నాడు. దీనికి అందరూ ఒప్పుకున్నారు.

మర్నాడు తెల్లవారుతూండగానే బహుమతులన్నీ రేవు చేరాయి. మహామేధి స్వయంగా దగ్గిర ఉండి వాటిని పడవలో తగినచోట్ల పెట్టించాడు. ఆ పూట రాజభవనంలో రూపధరుడికి బ్రహ్మాండమైన వీడ్కోలువిందు జరిగింది. అందరూ ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. కాని ఎప్పుడు




బయలుదేరి తనదేశం చేరుదామా అని ఆత్రపడుతున్న రూపధరుడు మాత్రం పొద్దుకేసి చూడసాగాడు.

చివరకు భోజనాలు ముగిసి పానీయాలు వచ్చాయి. రూపధరుడు లేచి నిలబడి, "మహాజనులారా, మీ పుణ్యంవల్ల ఇంత కాలానికి నా చిరకాల వాంఛితం ఈడేరి, నా దేశానికి నేను వెళ్లిపోతున్నాను. మీరు నాకు చూపిన ఆదరమూ, చేసిన సహాయమూ, ఇచ్చిన కానుకలూ ఎన్నటికీ మరువలేను. దేవతలు మీకు సంతోషమూ, సౌఖ్యమూ, అఖండ విజయాలూ చేకూర్తురు గాక! మీ దేశానికి ఎలాటి అరిష్టాలూ కలగ



కుండుగాక!" అన్నాడు. ఈ మాటలకు అక్కడ చేరినవారందరూ హర్షించారు. రూపధరుడు రాణివద్దకూడా సెలవు పుచ్చుకున్నాడు. ఆమె అతనికి అందమైన దుస్తులు బహూకరించింది, దాసీలచేత అతని పడవ వద్దకు పుష్కలంగా రొట్టెలూ, ఎర్రద్రాక్షరసమూ పంపింది.

పడవ నడిపే యువకులు పడవలోపల రూపధరుడికోసం కంబళీ పరిచి పక్కా, దుప్పటీ ఏర్పాటుచేశారు. రూపధరుడు పడవ ఎక్కి ఆ పక్కమీద పడుకున్నాడు. నావికులు తమ స్థానాలలో కూచుని తెడ్లు వేయసాగారు. పడవ కదిలింది.

రూపధరుడికి వెంటనే నిద్రపట్టింది. తన కష్టాలు తీరిపోయాయన్న ఆనందంలో అతను మైమరచి గాఢనిద్రలో మునిగిపోయాడు. పడవ వాయువేగంతో ప్రయాణించి మర్నాడు వేగుచుక్క పొడిచే సమయానికి ఇథకా చేరింది.

ఇథకాతీరాన ఒక మంచి రేవున్నది. ఆ రేవులో చేరిన పడవలు లంగరుకూడా దించవలిసిన అవసరం లేదు. ఈ రేవుకు దగ్గిరిగా ఒక పెద్ద చెట్టున్నది. ఆ చెట్టుకు నిడుపైన ఆకులున్నాయి. ఆ చెట్టు పక్కనే ఒక గుహ ఉన్నది. అందులో తేనెపట్లు





న్నాయి, ఎత్తయిన రాతి స్తంభాలున్నాయి. ఈ గుహకు దేవకన్యకలు వస్తారని ప్రతీతి. అందులోకి మనుషులు పోవచ్చు.



పడవ రేవును తగలగానే నావికులు ఒడ్డుకు దూకారు. మైమరచి నిద్రపోతున్న రూపధరుణ్ణి వారు నిద్ర లేపకుండా ఉన్న వాణ్ణి ఉన్నట్టుగా ఎత్తుకువచ్చి తీరాన ఉన్న ఇసకలో, పక్కతో సహా, పడుకో బెట్టారు. తరవాత అతని వస్తువులన్నిటినీ చెట్టుకింద పేర్చిపెట్టి, పడవను నడుపు కుంటూ వారి దేశానికి తిరిగి వెళ్ళిపోయారు.

రూపధరుడు నిద్రలేచి కళ్ళుతెరిచి చుట్టూ కలయజూశాడు. పొగమంచు దట్టంగా అలుముకుని ఉండటంచేత అతనికి తాను ఎక్కడ ఉన్నదీ తెలియరాలేదు. ఎదట ఉన్న రేవునూ, పక్కన ఉన్న కొండలనూ కూడా అతను పోల్చుకోలేకపోయాడు. అతను నిరాశతో, "అయ్యో, మళ్ళీ ఎక్క డికో వచ్చిపడ్డానే! ఇక్కడ ఎలాటి మనుషు లుంటారో? వారు క్రూరులూ, నరభక్షకులూ కారుగద? నావెంట ఈ వస్తువులన్నీకూడా దేనికి? వీటిని ఎక్కడ దాచేది? మహామేధి మహారాజు నాకు పూర్తిగా తోడ్పడ్డాడుకాడు; ఇథకా చేర్చుతానని మాట ఇచ్చి ఇంకెక్కడో దిగబెట్టాడు," అనుకున్నాడు.

అతను వస్తువులన్నీ ఎంచి చూసు కున్నాడు; ఒక్కటీ పోలేదు. అతను తన దేశాన్నిగురించి ఆలోచిస్తూ అటూ ఇటూ పచారుచేస్తూండగా అటుకేసి ఒక గొర్రెల కాపరి కుర్రవాడు వచ్చాడు. రూపధరుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతనా యువకుణ్ణి సమీపించి, "దేవుడల్లే కని పించావు, నాయనా! నువే నన్ను కాపాడాలి. అబద్ధమాడకుండా చెప్పు, ఇది ఏ దేశం? ఇక్కడ ఎలాటి మనుషులుంటారు? ఇది ద్వీపమా లేక తీరమేనా?" అని అడిగాడు.

దానికి యువకుడు, "అయ్యా, మీకు ప్రపంచజ్ఞానం తక్కువలాగుంది! లేక మీరు





దూరదేశంవారయి ఉండాలి. ఎందుకంటే మా దేశం ఊరూ పేరూ లేనిది కాదు. ఇథకాదేశాన్ని గురించి ట్రోయ్‌నగరంలో కూడా చెప్పుకుంటారు!" అన్నాడు.

రూపధరుడు చాలా చతురుడు. తాను చేరినది ఇథకా అని తెలిసి అతను లోలోపల చాలా పొంగిపోయాడు; కాని ఆ ఆనందాన్ని అణిచిపెట్టుకుంటూ, "అవునవును! క్రీట్ దీవులలోకూడా ఈ దేశంగురించి చెప్పుకోగా విన్నాను. నేను ఒక దుర్మార్గుణ్ణి చంపెయ్యటంచేత పారిపోయి రావలిసి వచ్చిందిలే," అంటూ అతను గొర్రెలకాపరికి ఒక కట్టుకథ అల్లి చెప్పాడు.



అతను మాట్లాడుతున్నంతలోనే గొర్రెల కాపరి అంతర్ధానమై, వాడి స్థానంలో బుద్ధిమతీదేవి ప్రత్యక్షమయింది. ఆమె నవ్వుతూ, "నీకన్న జిత్తులమారివాడు మరొకడులేడు! ఎంత అవలీలగా కథలు అల్లగలవు! నీ దేశానికి చేరుకున్నా నీకీ అలవాటు పోలేదు! కాని నేనుకూడా అంతో ఇంతో తెలివి గలదాన్నే! నా దగ్గిర నీ జిత్తులు పారవు. అసలుసంగతేమంటే నిన్ను ఎలాగైతేనేం నీ దేశం చేర్చానుగాని నీ కష్టాలు తీరలేదు. అందుచేత నువు తిరిగివచ్చినట్టు పురుగు కైనా తెలియరాదు, జాగ్రత్త!" అన్నది.

"అమ్మా, ఇది నిజంగా నా ఇథకాయేనా? ఎందుకంటే నేను నమ్మలేకుండా వున్నాను. నీవు నన్ను వేళాకోళం చెయ్యటం లేదుగద?" అన్నాడు రూపధరుడు.

"నీవు ఎవరినీ చూస్తూచూస్తూ నమ్మలేవు. మరొకడైతే ఇంత శ్రమపడి దేశం చేరాక భార్యా బిడ్డలను గురించి ఎన్నో ప్రశ్నలు వేసేవాడు. కాని నీకు నామీదనే నమ్మకం లేకుండా వున్నది. ఇదీ ఒక విధంగా మంచిదే. నీ భార్య అహోరాత్రాలు నీకోసం అలమటించిపోతున్నది. ముందు నీకు నీదేశాన్ని చూపిస్తాను గుర్తించు," అంటూ బుద్ధిమతి తన మహిమచేత అక్కడ

దట్టంగా పట్టివున్న పొగమంచును విచ్చ గొట్టింది. వెంటనే రూపధరుడు తాను పూర్వం ఎరిగిన గుర్తులన్నీ చూడగలిగాడు. తరవాత బుద్ధిమతి గుహలో ప్రవేశించి రూప ధరుడి వస్తువులు అందులో దాచివుంచ టానికి చోటు చూపించింది. తరవాత గుహకు ఒక రాయి అడ్డంపెట్టి ఇద్దరూ చెట్టుకింద కూచుని సంభాషించుకున్నారు.

"రూపధరా, మూడేళ్ళుగా కొందరు దుర్మార్గులు నీయింట తిష్ఠవేసి నీ సొత్తు తింటూ, నీ భార్యను స్వయంవరం చేసుకో మని వేధిస్తున్నారు. ఈ దుర్మార్గులకు బుద్ధి చెప్పే భారం నీదే. నీ భార్య వారికి ఆగ్రహం రాకుండా ఏవో కబుర్లు చెబుతూ నీ రాక కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నది," అన్నది బుద్ధిమతి.

"తల్లీ, నీ దయ వుంటే అలాగే వారిని హతమార్చుతాను. ఏంచెయ్యమంటావో చెప్పు!" అన్నాడు రూపధరుడు.

"ముందు నీరూపం పూర్తిగా మార్చేసి ఎవరూ నిన్ను గుర్తించకుండా చేస్తాను. నీభార్యా, నీకొడుకూ కూడా నిన్ను పోల్చుకో కూడదు. నీవు నీ పందులకాపరివద్దకు వెళ్లి అతనివద్ద వుండు. నీ పందుల మందలను కాకులకొండవద్ద అతను మేపుతున్నాడు. ఈలోపుగా నేను నీకొడుకు ధీరమతిని





ఇంటికి చేర్చుతాను. నీ క్షేమసమాచారాలు తెలుసుకునేటందుకుగాను అతను రారాజు వద్దకు వెళ్ళివున్నాడు!" అన్నది బుద్ధిమతీదేవి.

తరవాత ఆమె అతన్ని అతి వృద్ధుడు లాగా కనిపించేలాగు మార్చివేసింది. అతని చర్మమంతా ముడతలుపడిపోయింది. అతని తల చింపిరితల అయిపోయింది. ఆమె అతనికి ఒక చేతికర్రా, జోలెసంచీ ఇచ్చింది. తరవాత ఆమె రూపధరుడికి కాకులకొండకు మార్గం చెప్పి అంతర్ధానమయింది.

రూపధరుడు అడవులూ, కొండలూ దాటి తన పందులకాపరి ఉండే చోటు చేరుకున్నాడు. రూపధరుడి నౌకర్లందరిలోకీ



ఇతనే స్వామిభక్తిపరాయణుడు. అతను ఒక పెద్ద మైదానంలో తానూ, పందులూ ఉండటానికిగాను ఒక ఇల్లు కట్టి, దాని చుట్టూ రాతిగోడ అమర్చి, దాని పైభాగాన నాగజెముడు నాటాడు. అతని రక్షణలో వెయ్యి పందులున్నాయి; అప్పటికే రూపధరుడి ఇంట చేరిన దుర్మార్గులు ఆ మందలో నుంచి చాలా పందులను తెప్పించుకు తిన్నారు. పందులకు కాపలాగా నాలుగు వేటకుక్కలు వున్నాయి.

రూపధరుడు అక్కడికి వచ్చేసరికి పందులకాపరి తన వాకిట కూచుని తన కాళ్లకు చెప్పులజత తయారు చేసుకుంటున్నాడు. రూపధరుణ్ణి చూడగానే వేట కుక్కలు భయంకరంగా మొరుగుతూ మీదికొచ్చాయి. రూపధరుడు చప్పున తన చేతి కర్ర పారేసి, నేలమీద చతికిలబడ్డాడు. ఇంతలో పందులకాపరి లేచివచ్చి కుక్కలను అవతలికి తరిమేసి, "ఏం, ముసలాడా? కాస్తయితే నిన్ను కుక్కలు పొట్టన బెట్టుకునేవే! అసలే నా బతుకంతా వెతలుగా వుంది! బంగారమంటి యజమాని దేశాలు కాని దేశాలు పట్టి కూడు గుడ్డా లేక అలమటిస్తున్నాడు! ఇక్కడ పనికిమాలిన మూక ఒకటి దాపరించి పడి కొవ్విన పంది





నల్లా కోసుకుతింటున్నారు! లోపలి కొచ్చి ఇంత కూడు తిని నీ సంగతేమిటో చెబుదువు రా!" అన్నాడు రూపధరుడితో.

రూపధరుడు భోజనం చేసినంతసేపూ పందులకాపరి తన యజమాని గొప్పతనం గురించీ, అయన రారాజు వెంట ట్రోయ్ నగరం మీదికి యుద్ధానికి వెళ్లి, అచోకీ లేకుండా పోయిన విషయమూ చెప్పాడు.

అంతా విని రూపధరుడు, "అయ్యో, మీ యజమానిగురించి ఇంత గొప్పగా చెబుతున్నావు, ఎవరాయన? నేను చాలా దేశాలు తిరిగాను. నాకా మనిషి తగిలివుంటే వార్త చెబుతాను," అన్నాడు.

దానికి పందుల కాపరి, "నువ్వు వెయ్యి చెప్పేదిగాక, అమ్మగారూ, అబ్బాయిగారూ నీమాటలు నమ్మేది కల్ల! ఇప్పటి కెందరో చెప్పారు—అన్నీ వట్టి అబద్ధాలు. తిండి కోసమో, బట్టకోసమో ఆశపడితే వాళ్లలాగే నాలుగు బొల్లికబుర్లు నువుకూడా చెప్పవచ్చు," అన్నాడు.

"కూటికీ గుడ్డకూ ఆశపడి అబద్ధాలు చెప్పటం చాలా నీచం. నేను ప్రమాణంచేసి నిజం చెబుతున్నాను విను. అమావాస్య వెళ్లేలోపుగా నీయుజమాని తిరిగివస్తాడు. అతని శత్రువులకు పరాజయం తప్పదు.



నాకిప్పుడేమీ బహుమానం వద్దు, నామాట నిజమైనాక ఏదైనా తీసుకుంటాను!" అన్నాడు రూపధరుడు.

"పిచ్చివాడా, ఆయన ఇంకెక్కడ వస్తాడు? ఏనాడో ఆయన పోయాడు. అయన వస్తే ఇంక ఆ భార్యకూ, కొడుక్కూ అంత కంటె కావలిసిందేముంది? నిక్షేపమంటి అబ్బాయి, నాయనలాగే అంతెత్తు పెరిగాడు! ఏం అందమనుకున్నావు?" అన్నాడు పందుల కాపరి.

తరవాత ఇద్దరూ చాలాసేపు సంభాషించుకున్నారు. రూపధరుడు తన విషయం చెప్పుకుంటూ తాను క్రీట్ దేశస్థుడిననీ,





ట్రోయ్‌యుద్ధంలో పాల్గొన్నాననీ రూపధరుణ్ణి స్వయంగా ఎరుగుదుననీ చెప్పాడు. తాను తిరిగి వచ్చేదారిలో ఒక దేశంలో రూపధరుడు మళ్లీ కలిసినట్టుకూడా అతను చెప్పాడు. అయితే ఆ సంగతులు మాత్రం పందులకాపరి తాను నమ్మననేశాడు.

చీకటి పడేలోపల పందులకాపరి నౌకర్లు మందలతో తిరిగి వచ్చారు. ఆరాత్రి పందులకాపరి తన అతిథికోసం భోజనం బాగా తయారుచేశాడు.

బయట వానసాగింది. ఈదురుగాలి కొట్టింది. రూపధరుడికి చలివేసింది. అతను పందులకాపరితో, "ట్రోయ్ యుద్ధంలో ఒకసారి ఏమయిందనుకున్నావు? ఒక రాత్రి మేము కొంతమందిమి ట్రోయ్ గోడలకింద కాపలా కాయటానికి బయలుదేరి వెళ్ళి పొదలకింద పడుకున్నాం. ఆ రోజుకూడా ఇలాగే విపరీతమైన చలిగాలీ, మంచూ సాగాయి. నా ఒక్కడికే కప్పుకునే దుప్పటి లేదు. ఒక రాత్రివేళ నేను రూపధరుణ్ణి తట్టి లేపి నా దుస్థితి చెప్పాను. అయన వెంటనే ఒక యుక్తి పన్నాడు. తనకు పీడకల వచ్చిందనీ, ఎవరైనా వెంటనే బయలుదేరి రారాజువద్దకు వెళ్ళి మరికొందరు మనుషులను పిలుచుకు రావాలనీ అన్నాడు. ఇందుకుగాను ఒకడు లేచి, తన దుప్పటి అక్కడే పడేసి పడవల వద్దకు బయలుదేరాడు. వెంటనే నేనా దుప్పటి కప్పుకుని ఆ రాత్రి గడిపేశాను," అని చెప్పాడు.

"మంచి కథే చెప్పావు, ముసలాడా! ఈరాత్రి నీకు కప్పుకునేటందుకు ఉండక పోదులే!" అన్నాడు పందుల కాపరి.

చలిమంటకు దగ్గిరిగా తోళ్ళపక్క పరిచి రూపధరుణ్ణి దానిమీద పడుకోబెట్టారు. పందులకాపరి అతనిమీద మందమైన గొంగళి కప్పాడు. ఆ పక్కమీద వెచ్చగా పడుకుని రూపధరుడా రాత్రి సుఖంగా నిద్రపోయాడు. —(ఇంకా వుంది)



# "ఇంకా నయం!"

ఒకనాడు ఒక రైతు తమ జమీందారుగారిని చూడబోతూ తన భార్యతో, "ఏమే, జమీందారుగారికి వెలగకాయలు ఇస్తాను, ఒక బుట్టెడు కట్టి ఇయ్యి!" అన్నాడు.

"ఆయనకు వెలగకాయ లెందుకు? అత్తిపళ్ళు బాగా కాశాయి. తీసుకు పోయి ఇస్తే తింటారు," అని రైతుభార్య ఒక బుట్టనిండా అత్తిపళ్ళు పెట్టి భర్తకు ఇచ్చింది.

రైతు జమీందారుగారి దర్శనం చేసుకోవటానికి వెళ్ళేసరికి జమీందారుగారు వరండాలో కుర్చీవేసుకుని కూర్చుని ఉన్నాడు. అత్తిపళ్ల బుట్టను జమీందారుగారి పక్కనే పెట్టి, రైతు చేతులు కట్టుకుని ఎదురుగా నిలబడ్డాడు.

జమీందారుగారు బుట్ట పైమూత తీసి అత్తిపళ్ళు చూసి, ఒక పండుతీసి గురిగా రైతుతలమీద పడేటట్టు విసిరాడు. అత్తిపండు తలపైన పడగానే రైతు, "ఇంకా నయం!" అన్నాడు.

జమీందారుగారు దాదాపు అత్తిపళ్లన్నిటినీ రైతు తలపైన విసిరాడు. ప్రతి సారీ రైతు, "ఇంకానయం!" అనటం జమీందారుగారికి ఆశ్చర్యం కలిగించింది.

"నేను నిన్ను అత్తిపళ్లతో కొడుతూంటే నువు, ఇంకా నయం, అంటా వెందుకు?" అని జమీందారు రైతును అడిగాడు.

"నే నసలు తమకు వెలగకాయలు తెచ్చిపెడదామనుకున్నాను. పుణ్యాత్మురాలు నా భార్య వెలగకాయలు వద్దని అత్తిపళ్ళు కట్టి ఇచ్చింది. అదృష్టవంతుణ్ణికదా!" అన్నాడు రైతు.





# రాసిపెట్టిన వరుడు

పూర్వం ఉగ్రసేనమహారాజుకు మాధవి అని ఒకతే కూతురుండేది. ఆమె అపూర్వమైన సౌందర్యవతి. అందుచేత ఆ పిల్లకు పెళ్లి చేయవలిసిన సమయం దగ్గిరపడుతున్నకొద్దీ రాజుకు తీరని బెంగపట్టుకున్నది. ఇంత అందగత్తెకు తగిన వరుడు ఎక్కడ దొరుకుతాడు? కాకిముక్కుకు దొండపండు కట్టినట్టుగా మాధవిని సామాన్యుడి కిచ్చి ఎలా పెళ్ళి చేయటం.

ఉగ్రసేనమహారాజు దేశదేశాల రాజకుమారుల పటాలు తెప్పించి చూశాడు. వారిలో ఒక్కరూ మాధవి కాలిగోరికి పోలేటట్టు కనబడలేదు. చివర కాయన తన మంత్రి అయిన సుబుద్ధితో, "మంత్రీ, అమ్మాయికి తగిన వరుడు దొరికే ఉపాయమేది?" అని అడిగాడు.

"మహారాజా, రాజకుమారుడే కావాలని ఏమిటి? అమ్మాయిగారికి సరిపచ్చే అందగాడు ఎవడు కనిపించినా వివాహం జరిపించుదాం!" అన్నాడు మంత్రి.

అదిమొదలు రాజుగారు అందగాళ్లకోసం దేశం నలుమూలలా వెతికించాడు. అందచందాలు గల యువకులు చాలామంది కనిపించారు గాని వారిలో ఒక్కడూ మాధవికి భర్త కాదగినవాడుకాడు.

రాజుగారి విచారం మరింత అయింది. ఒకనాడాయన నిద్రపోతూండగా ఒక చిత్రమైన కల పచ్చింది. ఆ కలలో బ్రహ్మదేవుడు కనిపించి, "పిచ్చివాడా, నీ కుమార్తె పెళ్లికోసం ఎందుకు ఆరాటపడతావు. దానికీ, దాని కాబోయే భర్తకూ నేను అదివరకే ముడివేసి ఉంచాను," అన్నాడు.

"దేవా, ఆ వరుడెవరు? వాడిపేరేమిటి?" అని రాజు బ్రహ్మను ఆత్రంగా అడిగాడు.

"వాడిపేరు కురరవట్!" అని చెప్పి బ్రహ్మ అంతర్ధానమయాడు.

---

ఆర్. హనుమంతరావు



రాజు నిద్ర లేచినాక కల జ్ఞాపకం ఉన్నది గాని, మాధవికి కాబోయే వరుడి పేరు మరచిపోయాడు. అది మనిషిపేరు లాగాకూడా అయనకు తోచలేదు. కల వచ్చికూడా ప్రయోజనం లేకపోయింది.

మరి కొన్నాళ్ళు గడిచాక రాజుకు బ్రహ్మ మళ్లీ కలలో కనిపించి, "నీ అల్లుడు అది వరకే నిర్ణయమయాడని చెప్పానుగదా? ఇంకా ఎందుకు విచారిస్తున్నావు?" అని కోప్పడ్డాడు.

"దేవా, ఆ అల్లుడి పేరేమిటి?" అన్నాడు రాజు ఎంతో భక్తిగా.

"కురరవట్!" అని చెప్పి బ్రహ్మ మాయమయాడు.

రాజుకు ఈసారి ఈ విడ్డూరమైన పేరు జ్ఞాపకం ఉన్నది. మర్నాడు తెల్లవారగానే అయన సుబుద్ధితో, "మంత్రీ, మన అమ్మాయికి, కురరవట్ భర్త అవుతాడట. బ్రహ్మ దేవుడు స్వయంగా కలలో చెప్పాడు. అటు వంటి పేరు గలవాళ్ళు ప్రపంచంలో ఉంటా రనుకోను. అయినా ఎక్కడన్నా ఉంటే పట్టి తెప్పించు. వాడు అన్నివిధాలా అమ్మాయికి తగిన వరుడై ఉండాలి. లేకపోతే బ్రహ్మదేవుడు అమ్మాయిపెళ్ళి విషయమై ఇంత శ్రద్ధ తీసుకోడు," అన్నాడు.

"మహారాజా, ఈ పేరు చాలా రహస్యంగా ఉంచండి. లేకపోతే ఎవడో ఒకడు ఇదే పేరు చెప్పుకుని అమ్మాయిగారిని పెళ్ళా డెయ్యగలడు," అని మంత్రి హెచ్చరించాడు.

తరవాత అయన కొందరు తెలివిగల దూతలను ఏరి, "మీరు దేశమంతటా తిరిగి విడ్డూరమైన పేర్లు గలవారుంటే ఆ పేర్లూ, వారుండే చోట్లూ రాసుకురండి!" అన్నాడు.

వారు బయలుదేరి వెళ్లి అనేక విడ్డూరమైన పేర్లు రాసుకువచ్చారు. వారిలో ఒకడు "కురరవట్" అనే పేరు రాసుకువచ్చాడు. అది చూసి మంత్రి నిర్ఘాంతపోయి, "ఎవడు వీడు? ఎక్కడ ఉంటాడు?" అని అడిగాడు.



" వాడొక కోయకుఱ్ఱవాడు. మన నగ రానికి తూర్పుగా ఉన్న అరణ్యంలో చూశాను," అన్నాడు దూత.

సుబుద్ధి వెంటనే రాజుగారివద్దకు వెళ్లి, " మహారాజా, మీరు చెప్పిన పేరుగలవాడు ఒకచోట ఉన్నట్టు కబురొచ్చింది. నేను వెళ్ళి వాడి సమాచారం తెలుసుకుని వెంట పెట్టుకుని తీసుకువస్తాను," అన్నాడు. రాజు సరేనన్నాడు.

మూడురోజులకల్లా మంత్రి తిరిగి వచ్చాడు. అయనవెంట ఒక బక్కచిక్కన కుఱ్ఱవాడున్నాడు. వాడి శరీరం కారు నలుపు. తలమీది జుట్టు అట్టలు కట్టుకు పోయి ఉన్నది. వాడి వంటిమీద సరిగా బట్టలుకూడా లేవు.

రాజుగారా కుఱ్ఱవాణ్ణి గమనించనుకూడా లేదు. " ఏం మంత్రీ? వరుణ్ణి తెచ్చా నంటివిగా? ఒక్కడివే వచ్చావేం? వాడు రానన్నాడా? లేక మనం అనుకున్న పేరు గలవాడు కాడా? బెల్లంకొట్టిన రాయిలాగా మాట్లాడవేం?" అన్నాడు రాజుగారు.

సుబుద్ధి హీనస్వరంతో, " ఏం చెప్పేది, మహారాజా? నా నోటివెంట మాటలుకూడా రావటం లేదు. మనం అనుకున్న కుఱ్ఱ వాడు వీడే!" అంటూ తనవెంట వచ్చిన కోయకుఱ్ఱాణ్ణి చూపాడు.

రాజుగారి ముఖం ఒక్కసారి తెల్లబడి, అంతలోనే ఎఱ్ఱగా అయిపోయింది. అయన కోపంతో, " వీడా? వీడా? వీణ్ణి నాదాకా కూడా తెచ్చావెందుకు? వెంటనే తీసుకు పోయి హతమార్చెయ్యి. బ్రహ్మదేవుడూ, ముళ్ళూ ఏమవుతాయో చూద్దాం! వెంటనే తీసుకుపో!" అని అరిచాడు.

మంత్రి కోయకుఱ్ఱవాణ్ణి వెంటబెట్టుకుని తిరిగి అడివికి బయలుదేరాడు. రాజుగారికి కోపం వచ్చిందంటే రాదా? అయనమటుకు చూస్తూచూస్తూ, పండులాటి తన కుమార్తెను ఈ దిష్టిబొమ్మకు ఎలా ఇచ్చి చేస్తాడు?

ఇంతకన్న వెయ్యిరెట్లు అందమూ, ఐశ్వర్యమూ కలవారినే రాజుగారు తోసిపారేసి ఉన్నాడాయెను!

అయితే సుబుద్ధికి ఒక్కటే బాధకలిగించింది. అదేమిటంటే, ఈ కుర్రవాడి ప్రాణం అకారణంగా తీయటం. నిజానికి వాడు ఏ పాపమూ ఎరగడు. తనను చంపమని రాజుగారు ఆజ్ఞ ఇచ్చిన సంగతికూడా వాడికి తెలియదు. వాడికి అరణ్యం తప్ప మరేమీ తెలిసినట్టులేదు. అరణ్యం వదిలినది మొదలు తిరిగి అరణ్యానికి తిరిగి వచ్చినదాకా వాడికంతా అయోమయంగానే ఉన్నది.



వారిద్దరూ అరణ్యంలో ప్రవేశించగానే వాడికి మళ్ళీ జవం వచ్చింది. వాడు కనిపించిన పళ్ళచెట్లల్లా ఎక్కి, మంచిమంచి అడవిపళ్ళు కోసి తాను తింటూ సుబుద్ధికి కూడా ఇచ్చాడు. అది చూసి సుబుద్ధికి వాడిమీద మరింత దయ కలిగింది.

"నేను నా చేత్తో వీడిగొంతు కొయ్యలేను. అటు రాజుగారి మాటకూడా దాటటానికి వీలులేనిది. అందుచేత వీడు చచ్చిపోవటానికి ఇంకేదైనా ఉపాయం ఆలోచించాలి!" అనుకున్నాడు సుబుద్ధి.

ఆ ఉపాయంకూడా ఆయనకు త్వరలోనే తట్టింది. ఆయన తల ఎత్తి చూసేసరికి అంతదూరాన వాసుకికొండ కనిపించింది. ఆ కొండమీద ఒక పెద్ద సరస్సున్నది. దాన్ని వాసుకి సరస్సు అంటారు. ఆ సరస్సు దగ్గిరికి వెళ్ళి ప్రాణాలతో తిరిగివచ్చినవారు లేరు. ఆ సరస్సులో కాలు పెట్టినవారిని వాసుకి అనే ఒకగొప్ప సర్పరాజు ఈడ్చుకుపోతాడని ప్రతీతి.

సుబుద్ధి కోయకుర్రవాడితో, "ఒరే, నీవల్ల నాకొక చిన్నపని కావాలి. ఆ కనిపించే కొండకు వెళ్ళి, దానిమీద ఉండే సరస్సు నుంచి నువు మోయగలిగినంత ఇసుకా, గులకరాళ్లూ తీసుకుని నాదగ్గిరికి రా. నీకు మంచి బహుమానం యిస్తాను," అన్నాడు.

"అందాకా నువ్విక్కడే ఉంటావా, దొరా?" అన్నాడు కుర్రవాడు.

"మనం వెళ్ళామే ఆ నగరానికి రా! ఇదుగో నా ఉంగరం. దీన్ని వేలికి పెట్టుకో. ఆ నగరానికి వచ్చి ఈ ఉంగరం చూపిస్తే ఎవరు పడితే వారు నిన్ను నా దగ్గిరికి చేర్చుతారు. ఇంద, ఈ కాసు నీ దగ్గిర ఖర్చుకుగాను ఉంచు," అంటూ సుబుద్ధి తన చిటికెన వేలి ఉంగరం తీసి వాడి మధ్యవేలికి పెట్టి, వాడి చేతికొక బంగారు కాసిచ్చాడు.

అవి రెండూ తీసుకుని కోయకుర్రవాడు పుత్సాహంతో వాసుకి పర్వతంకేసి బయులుదేరాడు. అక్కడికి చేరటానికి వాడికి మూడురోజులు పట్టింది. అయితే దారి పొడుగునా అరణ్యమే. అరణ్యంలో బతకటం వాడికి పుగ్గుపాలతో నేర్చిన విద్య. అందుచేత వాడు మూడురోజులూ సునాయాసంగా ప్రయాణం చేసి వాసుకిపర్వతం చేరి, సరస్సుండే చోటికి ఎక్కాడు.

మూడురోజుల ప్రయాణంకన్న వాడికా పర్వతం ఎక్కటం శ్రమ అనిపించింది. ఎందుకంటే ఎండ చాలా తీవ్రంగా వుంది. చివరకు వాసుకిసరస్సు కనిపించగానే వాడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. వాడు వెనకాముందు చూడకుండా అమాంతం నీటిలోకి దూకి చాలాసేపు ఆనందంగా ఈదు



లాడాడు. అదృష్టవశాత్తూ వాసుకి అనే సర్పరాజు గాని, మరొక పాముగాని వచ్చి వాణ్ణి మింగలేదు.

సరస్సులో ఈదినంతసేపు ఈది వాడు నీటి అడుగునుంచి బోలెడంత ఇసుకా, రాళ్ళూ ఒడ్డుకు చేరవేసి దాన్ని తన చొక్కాలోనే మూటగట్టుకున్నాడు. వాడికి రెండు విషయాలు ఆశ్చర్యం కలిగించాయి. ఎప్పుడూ నల్లగా వుండే తన చేతులు పచ్చగా అయిపోయాయి. తీరా చూస్తే తన వళ్ళంతా పచ్చగా మారిపోయి ఉన్నది. ఇంకొకటేమంటే, ఈ సరస్సులో ఉండే ఇసుకా, రాళ్లూ చాలా అద్భుతంగా ఉన్నాయి. "అందుకే ఆ దొరగారు వీటిని తెమ్మన్నాడు!" అనుకున్నాడు వాడు.

ఇక తాను ఆ పెద్దమనిషివద్దకు తిరిగి పోవాలి. అందుకని వాడు సరస్సు ఒడ్డున ఉన్న గుట్టలమీదికి వచ్చి కొండ అవతలి వేపు చూశాడు. కొండ కిందనే ఒక నగరం కనబడింది. వాడు చూసినదే ఒక్కనగరం కావటంచేత ఈ నగరం ఆ నగరమే అనుకుని గబగబా కొండ దిగి సాయంకాలానికల్లా నగరం ప్రవేశించాడు.

తన వేలిన ఉన్న ఉంగరం ఎంత మందికి చూపినా ఒక్కరుకూడా గుర్తించలేదు. వాడికి అకలి దహించుకుపోతున్నది.





మంత్రి ఇచ్చిన కాసు పెట్టి తినుబండా రాలు కొనుక్కుతిన్నాడు. తరవాత వాడు ఆ నగరం వదిలిపెట్టి రహదారిన బయలు దేరి ఇంకొక నగరం చేరాడు.

అక్కడకూడా వాడిదగ్గిర వున్న వుంగ రాన్ని ఎవరూ గుర్తించలేదు. వాడికి ఆకలిగా వున్నది. చేతిలో ఏమీ డబ్బు లేదు. "ఈ గులకరాయి ఇస్తే ఎవరన్నా డబ్బిస్తారేమో! గొప్పవాళ్ళు విలవలేని వస్తువులు కోరరు. ఈ గులకరాళ్ళకు ధర వుండవచ్చు. అందుకే ఆ పెద్దమనిషి వీటిని తెమ్మ న్నాడు. ఒక్క చిన్న రాయి అమ్మితే ఇంతలో ఆయనగారికేం నష్టం వస్తుందిలే!"

అనుకుని, కోయకుర్రవాడు తన మూటలో నుంచి ఒక చిన్న రంగురాయి తీసి ఒక దుకాణానికి వెళ్ళి, దుకాణదారుతో, "అయ్యా, దీనికేమిస్తారు?" అని అడిగాడు.

దుకాణదారు ఆ రాతికేసి చూసి తరవాత యువకుణ్ణి ఎగాదిగా చూశాడు.

"ఈ కుర్రవాడు చూడటానికి పేదగా వున్నాడు గాని, అతని వాలకం చూస్తే బతికి చెడిన రాజకుమారుడులాగా తోస్తు న్నది. లేకపోతే ఇంత విలవైన రత్నం ఇతని దగ్గిరికి ఎందుకు వస్తుంది?" అని దుకాణదారు తనలో అనుకుని, యువ కుడితో, "మూడువందల కాసులిస్తాను. ఆ పైన నావల్ల కాదు," అన్నాడు.

యువకుడు తన చెవులను తానే నమ్మ లేకపోయాడు. "మూడువందల కాసులా?" అన్నాడతను ఆశ్చర్యంతో.

బేరం చెడిపోతుందని దుకాణదారుకు భయంవేసి, "పోనీ ఇంకొక్క వంద ఇస్తాను. ఈ రాయి అంతకన్న విలవ చెయ్యదు," అన్నాడు.

దుకాణదారు వేళాకోళం చేస్తున్నాడని యువకుడికి రూఢి అయింది. "నాతో వేళాకోళం దేనికిలే! నిజంగా ఏమిస్తావో చెప్పెయ్యి!" అన్నాడు.



"అబ్బో, నీతో చాలా పేచీయేనే. అయిదువందల కాసులు తీసుకో. ఇంక జేరమాడకు!" అంటూ దుకాణాదారు సంచీ విప్పి అయిదువందల బంగారు కాసులు తూచి యువకుడికి ఇచ్చేశాడు.

తనదగ్గిర ఉన్న రాళ్ళన్నీ అమ్మితే ఈ లెక్కన వేలకువేల కాసులు వస్తాయని యువకుడు రూఢిచేసుకున్నాడు.

"ఆ పెద్దమనిషికోసం వెతుకుతూ ఎన్ని ఊళ్ళు తిరగను? ఇంతా కష్టపడి తిరిగి ఇదంతా అయనకు ఇవ్వటం తప్ప నాకేమి ఒరుగుతుంది. కొద్ది రాళ్లు అమ్మితే ఈ నగరంలోనే ఇల్లు కట్టుకుని స్థిరపడి పోవచ్చు!" అనుకున్నాడు యువకుడు.

అతను ఆ రోజే బజార్లన్నీ తిరిగి తనకు మంచి దుస్తులు కొనుక్కున్నాడు. క్రమంగా ఒక పెద్ద భవనం కట్టించుకుని, రత్నాల రాజు అనే పేరుతో, ఆనగరంలో సుఖంగా జీవించసాగాడు.

రత్నాల రాజు అందచందాలను గురించీ, సంపదను గురించీ, ఆనోటా ఆనోటా చెప్ప కోగా ఆ వార్తలు ఉగ్రసేన మహారాజుకు కూడా తెలిశాయి. ఆయన సుబుద్ధితో, "మంత్రీ, ఇక్కడికి పన్నెండామడ దూరంలో రత్నాలరాజున్నాట్ట. అతనికి వివాహ



మయిందో లేదో, అతను అమ్మాయిని చేసుకునేటందుకు పనికివస్తాడో రాడో చూసి వస్తావా ఏమిటి?" అన్నాడు.

సుబుద్ధి తగిన పరివారంతో బయలుదేరి రత్నాలరాజు దర్శనం చేసుకున్నాడు. ఆ ఇద్దరూ ఒకరినొకరు పోల్చుకోలేదు.

"మా రాజుగారికి మహా అద్భుత సౌందర్యవతి అయిన కూతురున్నది. ఆమెకు మీరే తగిన వరుడని నాకు తోస్తున్నది. వివాహం ఏర్పాటు చెయ్యమంటారా?" అని సుబుద్ధి అడిగాడు.

రత్నాలరాజు సమ్మతించాడు. సుబుద్ధి అతన్ని వెంటపెట్టుకుని తమ దేశానికి

తీసుకుపోయి రాజప్రాంగణంలో ఉండే విడిదిలో దింపాడు. రాజుగారూ, రాజబంధువులూ వచ్చి అతన్ని చూసి, "మన మాధవికి ఇంతకంటే మంచి భర్త దొరకడు!" అన్నారు.

రాజుగారికికూడా అలాగే తోచింది. అయన తన మంత్రినీ పురోహితుడినీ పిలిచి, "పెళ్లికొడుకు జాతకం విచారించి పెళ్లి ముహూర్తం ఏర్పాటు చేయండి!" అన్నాడు.

సుబుద్ధి రత్నాలరాజుండే విడిదికి వెళ్లి అతనితో, "అయ్యా, మీ జాతకం ఉంటే ఇప్పించండి. మీ తలిదండ్రు లెవరు? మీ వంశం ఏమిటి? ఆ విషయాలు తెలుసుకోవలిసిన అవసరం కలిగింది," అన్నాడు.

"అయ్యా, నేను ఒక కోయవాణ్ణి. నన్ను అందరూ రత్నాలరాజు అంటున్నారు గాని, నా అసలు పేరు కురరవట్," అన్నాడు యువకుడు.

ఆ మాట వినగానే మంత్రి కొయ్యబారిపోయాడు. ఆ యువకుడు తన వృత్తాంతమంతా చెప్పి తన వేలిన ఉన్న ఉంగరం ఆనవాలు చూపిన తరవాత సుబుద్ధికి నమ్మకం కుదిరింది.

అయన వెంటనే రాజుగారివద్దకు వెళ్లి, "మహారాజా, కొంప మునిగింది. ఈ రత్నాలరాజే ఆనాడు నేను మీవద్దకు తెచ్చిన కోయవాడు. ఇప్పుడేం చేద్దాం?" అంటూ అతడి కథ యావత్తూ చెప్పాడు.

రాజు అంతా విని, "ఆ ముసలి బ్రహ్మ సామాన్యుడు కాడు. అయన వేసిన ముడి విప్పటం నీ తరమా? నా తరమా? ముహూర్తం పెట్టించి అనుకున్న ప్రకారం పెళ్లి జరిపించుదాం!" అన్నాడు.

ఆ ప్రకారమే రత్నాలరాజుకు మాధవిని ఇచ్చి పెళ్లి చేశారు. ఈ పెళ్ళి చూసి హర్షించనివారు లేరు. "మొత్తంమీద రాజుగారు గట్టివాడు. తన కూతురికి తగిన వరుణ్ణి మూడులోకాలూ వెతికి మరీ తెచ్చాడు!" అన్నారందరూ.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రత్యర్థి కాదది....

రెండవ ఫోటో : ప్రతిబింబమే కాని

పంపినవారు : వాసా అన్నాజీరావు,
సమాజంవీధి, సాలూరు (శ్రీకాకుళం జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# ఎగిరే ఉడతలు

మనం చూసే ఉడతలు తోక విదిలించి దూకుతాయి. కాని "ఎగిరే" ఉడతలను మనం ఎరగం. ఇవి అమెరికాలోనూ, కెనడాలోనూ కొన్ని ప్రాంతాల అడవులలో ఉన్నాయి. అయితే వీటిని సహజ వాతావరణంలో గమనించటం దాదాపు అసాధ్యం. ఎందుకంటే ఇవి పగలు నిద్రపోయి రాత్రి జీవిస్తాయి. వీటిని మచ్చికచేసి పెంచినవారున్నారు. అందుచేత వాటినిగురించి మనం తెలుసుకునే అవకాశం లభించింది.

వీటిని "ఎగిరే" ఉడతలు అనటం నిజానికి సరికాదు; "వాలే" ఉడతలు అనవలిసి ఉంటుంది. ఎగరటానికి వీటికి రెక్కలు లేవు. కాని గబ్బిలాలకులాగే వీటికికూడా, ముందుకాళ్లకూ వెనకకాళ్లకూ మధ్య ఒక చర్మపుపార ఉంటుంది. అవి దూకేటప్పుడు తమ కాళ్లను పక్కలకు చాచి, ఈ చర్మపుపారను పరుస్తాయి. దాని సహాయంతో అవి 50 గజాలు మించిన దూరం తేలిపోగలవు.

ఎగిరే ఉడతలలో ఒక చిన్న జాతీ, ఒక పెద్ద జాతీ ఉన్నాయి. అమెరికా తూర్పు రాష్ట్రాలలో నివసించే ఉడత సుమారు మూడున్నర ఔన్సులు—9 లేక 10 తులాలు—బరువుంటుంది. దాని శరీరం నిడివి 5 అంగుళాలూ, తోక నిడివి 5 అంగుళాలూ ఉంటుంది. వాటి శరీరాల పైభాగం బూడిద కలిసిన పసుపు రంగుగాని, అచ్చ బూడిదరంగుగాని, పలకరంగుగాని ఉండవచ్చు. శరీరం అడుగుభాగం తెల్లగా ఉండి, అంచులు పచ్చవాగుగా ఉంటాయి. ఈ ఉడత కూచుని ఉన్నప్పుడు దాని శరీరం బొద్దుగా, కొవ్వి ఉన్నట్టు కనిపిస్తుందిగాని,



ఎగిరేసమయంలో, దాని చర్మం పరుచుకుని ఉన్నప్పుడు, బక్కపలచగానే ఉంటుంది.

ఎగిరే ఉడతలు ఎత్తుగా ఉండే చెట్ల పైకొమ్మలలో తొర్రలలో నివసిస్తాయి. అవి కాయలూ పప్పులూ, క్రిమికీటకాలూ మొదలైనవి తింటాయి. మచ్చిక అయిన ఉడతలు తమను పెంచేవారిని చాలా ప్రేమిస్తాయి. అవి సులువుగా కొత్తవాళ్లకుకూడా అలవాటు పడిపోతాయి. అవి పగలల్లా తమ "గూడు"లో నిద్రపోయి సాయంకాలం కాగానే లేస్తాయి. లేచిన తరవాతకూడా ఒక అరగంట సేపు బద్ధకంగా ఉంటాయి. ఆతరవాత వాటికి ఎక్కడలేని ఉత్సాహమూ కదలికా వస్తుంది. అవి కాంతిని భరించలేవు. దీపపుకాంతి సయితం హెచ్చుగా ఉంటే అవి సహించవు. అలాంటప్పుడు అవి చీకటి కోణాలలో చేరి ఇవతలికి రావు.

అవి కాస్సేపైనా కుదురుగా కూచోదలిస్తే ఎత్తయిన ప్రదేశానికి ఎక్కి కూచుంటాయి. నేలమీద పరిగెత్తుతాయి, ఆగినా క్షణంపాటుమాత్రమే ఆగుతాయి. ఎత్తునుంచి ఎక్కడికైనా దూకదలిచినప్పుడు దూకేప్రదేశాన్ని తల అటూ ఇటూ తిప్పి జాగ్రత్తగా పరిశీలించి చాలా గురిగా దూకుతాయి. (కొన్ని రకాల ఎలుకలు తాము దూకబోయే ప్రదేశాన్ని ముందుగా చూసుకోవు.)

వాటికి పప్పులు సయించినంతగా పళ్లూ, ఆకులూ సయించవు. ఉడతలు మాంసాహారులన్నది చాలామందికి తెలియదు. అవి అనేక రకాల పురుగులనూ, కీటకాలనూ, వాటితాలూకు గుడ్లనూ తింటాయి. పప్పులుండే కాయలు వాటి ముందు పోస్తే, పురుగులుపట్టిన కాయలను ముందు ఏరితింటాయి. పప్పుల కాయలను అవి తమ గూళ్లలో దాచుకుంటాయికూడా. గట్టిపెంకులుగల



కాయలను అవి చాలా ఉపాయంగా కొరికి పెంకు విడదీస్తాయి; కొన్ని సమయాలలో ఒక్క కాయను చాలా రోజులపాటు, అప్పుడు కాస్తా, అప్పుడు కాస్తా కొరుకుతాయి.

ఎగిరే ఉడతల కాళ్లు చాలా బారుగానూ, బలిష్ఠంగానూ ఉంటాయి. ముందుకాళ్లు చేతులలాగా ఉపయోగపడతాయి. వాటిగోళ్లు పదునుగా ఉండి చెట్లు మొదలైనవి ఎక్కటానికి ఉపయోగపడతాయి. నున్నని ఇనపచువ్వలు ఎక్కటానికి గోళ్లు ఉపయోగించే అవకాశం లేదు. అలాటప్పుడుకూడా ఈ ఉడతలు ఆ చువ్వలను చేతులతో పట్టుకుని అతివేగంగా ఎక్కుతాయి. అవి వెనక కాళ్లతో దేన్నయినా పట్టుకుని తలకిందులుగా వేళ్లాడుతూ చేతులతో కాయలు పట్టుకుని తినగలవు.

మచ్చిక అయిన ఉడతలు తమను పెంచే మనిషిమీద స్వేచ్ఛగా పాకుతాయి, బట్టలలోపలికి దూరుతాయి, జేబులలోకి పోయి పరీక్షిస్తాయి, అక్కడే పడుకుంటాయికూడా. అవి మనుషులపై తమకుండే ప్రేమను చాలా రకాలుగా సూచిస్తాయి; భుజంమీద కూచుని చెవితమ్మలు కొరికినట్టు నటిస్తాయి, చెవిలోకి మూతి పెట్టి మూచూస్తాయి. వాటిలో అవి పరస్పరం స్నేహం ప్రదర్శించేటప్పుడు కూడా ఇలాగే చేస్తాయి. తమను పెంచేవాడిచేత వీపు నిమిరించుకుంటాయి, చెవులవెనక గోకించుకుంటాయి, దవడలూ, గడ్డమూ నిమురుతుంటే అవులలాగా మోర చాస్తాయి.

నిద్రమత్తు వదిలినదిమొదలు అవి చాలా చలాకీగా ఉండి ఒక్కక్షణం స్థిమితంగా కూచోవు; శరవేగంతో పరిగెత్తుతాయి, కనపడిన వస్తువల్లా ఎక్కు



తాయి, మళ్లీ దూకుతాయి. వాటికి అలవాటు లేని చప్పుడేదైనా అయితే వెంటనే తమను పెంచేవాడి వద్దకు చేరిగాని, ఎత్తయినచోట కంత చూసుకునిగాని దాక్కుంటాయి. కాగితం నలిపిన చప్పుడు వింటే వాటికి చాలా భయం.

" ఎగిరే " ఉడతలు పుట్టినప్పుడు సుమారు అర తులం బరువుంటాయి. వాటి శరీరంమీద ఎక్కడా ఒక్క రోమం ఉండదు. ఎర్రరంగుగా ఉంటాయి. కళ్లు తెరవవు. మూడో రోజుకల్లా నెత్తి పైభాగానా, మెడమీదా, భుజాలమీదాగల చర్మం నలుపు తిరగనారంభిస్తుంది. 15 రోజులు గడిచాక శరీరం పైభాగాన బూడిదరంగు రోమాలు మొలవనారంభిస్తాయి. అప్పుడు దాని బరువు ఒకటిన్నర తులాలుంటుంది. కళ్లు కొద్దిగా విచ్చుకుంటాయి. మరొక అయిదు రోజులలో శరీరం పైభాగమంతటా రోమాలు వచ్చేస్తాయి. అడుగుభాగాన తెల్లని నూగు ప్రారంభమవుతుంది. 25 రోజులు గడిస్తేనేగాని వాటి కళ్లు పూర్తిగా తెరుచుకోవు. పూర్తిగా నాలుగు వారాలు గడిచాక అవి బాగా పాకటం నేర్చుకుంటాయి. 8 వారాలు (56 రోజులు) గడవగానే తల్లిదగ్గిర అవి పాలు తాగటం మానేస్తాయి. 7వ వారం ఆరంభమైనది మొదలు అవి ఇవీ కొరికి చూడటం మొదలుపెడతాయి.

పిల్లలకు సుమారు 10 వారాలు నిండేదాకా తండ్రిఉడత తల్లిఉడతనూ, పిల్లఉడతలనూ సమీపించటానికి సాహసించదు. ఒకవేళ మగ ఉడత దగ్గిరికి వచ్చినా ఆడ ఉడత తరిమేస్తుంది. తండ్రి దగ్గిరికి వచ్చేసరికి పిల్లఉడతలు పూర్తిగా ఎదిగి అన్నివిధాలా పెద్ద ఉడతలను పోలిఉంటాయి, కాని ప్రమాణంలో కొంచెం చిన్నవిగా కనిపిస్తాయి.



# చిత్ర కథ





ఒక రోజున దాసూ, వాసూలు ఆడుకుంటూ వుండగా, మిఠాయి అమ్మేవాడొకడు, 'టైగర్'ను పట్టుకుని, తన ముందున్న ముక్కాలిజంగిడీకి కట్టివేశాడు. దాసూ వాసూలు వెళ్ళి అడిగితే 'ఈ కుక్క నాలుగణాలుచేసే మిఠాయి తిన్నది. ఆ డబ్బులిస్తే వదిలిపెడతాను,' అన్నాడు. దాసూ, వాసూలు మాట్లాడకుండా కొంతదూరం వెళ్ళి, 'టైగర్'ను పిలిచారు. వెంటనే అది ఒక్క వూపున జంగిడీతోసహా, దాసూ వాసూలకేసి పరిగెత్తింది. జంగిడీమీద వున్న మిఠాయి చెల్లాచెదురుగా కింద పడిపోవటం చూసి మిఠాయివాడు లబోదిబోమన్నాడు.






**Printed by B. NAGI REDDI at the B.N.K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI CHAKRAPANI**

# చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదుచేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

★

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

మా పనితనమును

గురించి గొప్పగా

చెప్పటముకాదు

# అత్యుత్తమంగా

చేసి చూపుతాము

★

పోస్టర్లు
క్యాలెండర్లు
కార్టన్లు
లేబిల్సు
బుక్లెట్సు
ఫోల్డర్లు

ఆఫ్‌సెట్ ప్రింటింగులో ఏది కావలసినా సరే



మేలైన ముద్రణకు గుర్తు

## ప్రసాద్ ప్రాసెస్ (ప్రైవేట్) లి. మదరాసు - 26

ప్రతినిధి కార్యాలయాలు :

బొంబాయి-1, లోటస్ హౌస్, మెరీన్ లైన్స్, (ఫోన్ : 241162)

బెంగళూరు : డి/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, (ఫోన్ : 6206)

# దీనిని చదివితే మీరు ఆశ్చర్య పడతారు



ఏజియన్ సముద్రంలో, ఒక చిన్న లంకవుంది. దాని పేరు అర్జంటీరియా దానినేల సబ్బు గుణములతో గూడి వుంది. ఆనేలమీద కొంచెం నీళ్లు పోస్తే నురగ వస్తుంది. ప్రత్యేకంగా వర్షం వస్తే లంకంతటా నేలమీద మోకాటిలోతు నురగవుంటుంది. ఆ లంకలో నివసించే జనులు, ఎల్లప్పుడూ ఆను రగను బట్టలుతక డానికీ, స్నానానికి కూడా వాడుకొనేవారు.



సబ్బులాంటి వస్తువును శరీరాన్ని శుభ్రపర్చుకోడానికి వాడుకోవటం, కొత్త సంగతి కాదు. ఇలాంటి వస్తువులు గత *2500* ఏళ్లనుంచీ వాడుకలో వున్నాయని చరిత్రను బట్టిమనకు తెలుస్తోంది.



సబ్బును వైజ్ఞానికపద్ధతిలో తయారు చేసినట్టి ప్రతిష్ఠ చవ్‌రాల్ అనే పేరుగల ఒక ఫ్రెంచి వ్యక్తికి చెందుతుంది, ఆయన *1813*లో మొట్ట మొదటి సబ్బును తయారు చేశాడు.

లైఫ్‌బాయ్ సబ్బు *1894*లో పుట్టింది. అది ఈనాడు ప్రతీ దేశంలోనూ, ఆరోగ్యానికీ పరిశుభ్రతకూ అంతర్జాతీయ రాయబారియైవున్నది. అందుకు కారణం యిది; మనం ఏంచేస్తున్నా-ఆడుకుంటున్నా, లేదా చదువుకుంటున్నా ఎల్లప్పుడూ మురికౌతాము, ఆమురికిలో వ్యాధిని కలిగించే క్రిములున్నాయి. అవి దుర్భిణీ మూలకంగా మాత్రమే కనిపిస్తాయి. లైఫ్‌బాయ్‌లో గల ముఖ్య గుణమేమి టనగా, అది ఆక్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడును. మీరు కూడ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానముచేయుట అలవాటు చేసుకొని, ఆవిధంగా మీ ఆరోగ్యమునుకాపాడుకోండి.




L. 276-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారీ.

Worth any price

"And yet priced low"

Nutrine
SWEETS

ది న్యూట్రిన్ కన్ఫెక్షనెరి కంపెని
లిమిటెడ్, చిత్తూరు (ఆంధ్ర)

---

# రవి టాయ్‌లెట్స్‌ను వాడండి

**రవి గ్లిసరిన్ సోపు:**
మీ అందమును వర్చస్సును కాపాడును.

**రవి వెజిటబుల్ హేరాయిల్:**
మీ కేశములను విరివిగా పెంపొందించును.

**రవి స్నో:**
మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.




సోల్ ఏజంట్లు:

ది న్యూ స్టార్ & కంపెని,
తండియార్పేట :: మద్రాసు-21

Photo by D. S. Kasbeker



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రతిబింబమే కాని

పంపినవారు :
వి. అన్నాజీరావు - సాలూరు

